Photo by D. Kasbeker



బహుమతి
పొందిన వ్యాఖ్య

"పడినావా! పరమానందం...

పంపినవారు:
వి. ఆర్. సర్వో - పర్తి

మనోహరమైన
ముఖ లావణ్యమునకు
సులభమయిన కిటుకు....





అశోకా

ఫ్లవర్ ఆఫ్ హెవెన్

స్నో



నవవికసిత పుష్పమువలె నున్న
మీ ముఖవర్చస్సు అందరను
ఆశ్చర్యచకితులను చేయును.



విజయా కెమికల్సు, మద్రాసు - 7.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక కార్టూనులు, ఫోటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




మనోహరమైన
ముఖలావణ్యమునకు

నేషనల్ వారి
కాశ్మీర్ స్నో






సినిమా
తార లందరకు
నచ్చినది



ది నేషనల్ ట్రేడింగ్ కంపెని, బొంబాయి-2 • మదరాసు-1

# ఆయన కుమార్తె కాలేజీకి త్వరగా వెళ్లగలుగుతున్నది —అందుకు కారణం ఆమె హెర్క్యులిస్ సైకిలే

కాలేజీకి వెళ్లే తన కుమార్తెకు, విజ్ఞత, అనురాగం గల తండ్రి ఒక హెర్క్యులిస్ కొని ఇస్తాడు. బస్సు ప్రయాణాలలో ఉన్న ఇబ్బందులు ఆయనకు తెలుసును. కుమార్తె తిరిగి ఇంటికి వచ్చేందుకు ఆలస్యమైతే, తన భార్య ఎంత తాపత్రయం పడేది కూడా ఆయనకు తెలుసును. ఇప్పుడు హెర్క్యులిస్ ఉండడంవల్ల, తన కుమార్తె చదువుకోడానికీ, ఇంట్లో తల్లికి సహాయం చేయడానికీ, ఎక్కువ సేపు వ్యవధి దొరుకుతున్నది. జీవితంలో మనిషికి హెర్క్యులిస్ ఉపయోగపడినంత కాలం పనికివచ్చే ఇతర వస్తువులు బహు కొద్దిగా ఉంటవి.

శ్రేష్ఠమైన సైకిళ్ళను తయారుచేయటంలో దాదాపు 50 సంవత్సరాలు గడించిన అనుభవంతో టి. ఐ. సైకిల్స్ వారి ఆధునిక కర్మాగారంలో హెర్క్యులిస్ దృఢంగాను, నిర్దుష్టంగాను తయారుచేయబడింది. అది అందంగా ఉంటుంది. ఏమాత్రం శ్రమలేకుండా సాఫీగా నడుస్తుంది. అందువల్ల ఈ రోజుల్లో మీరు కొనగల సైకిళ్ళలో హెర్క్యులిస్ ప్రశస్తమైనది.

మీ సైకిల్ మీకు పెట్టుబడి

## హెర్క్యులిస్

మీ డబ్బుకు ఉత్తమమైన ప్రతిఫలం

తయారీ: టి. ఐ. సైకిల్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు




ధైర్యశాలి
రాముూ
డంబాల
రంగా


భద్రం, రంగా
శరవేగంగా వస్తోంది
గుఱ్ఱం.


ఇట్టి గుఱ్ఱాలనెన్నో
చూశానులే,
నాకున్నంత బాహు
బలానికి...


...నడిచే మోటార్ కారును ఎడంచేత్తో ఆపగలను...


...ఏనుగును నా చాతీమీద
నడిపించుకోగలను...


..చెలరేగిన ఎడ్లను నాపళ్లతో లాగుతాను..

DL. 479A-50 TL














అవును, పిల్లలారా! బలానికి 'డాల్డా' వనస్పతి అవసరం. 'డాల్డా'లో ఎ, డి, విటమిన్‌లు కలుపబడ్డవి. రుచియైన ఆహారములు కావాలంటే, మీ ఆహారమును ఎల్లప్పుడూ 'డాల్డా'తో వండమని మీ అమ్మను అడగండి.





DL. 479B-50 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి.




రిజిస్టర్డు నం: 119923

# డైమండ్ సుగంధవక్క పొడి

## ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధిచెందినదిన్నీ. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

పొట్లం ఒకంటికి 2 న. పై. మాత్రమే.

## ది డి. పి. అండ్ కంపెని,

## కౌల్ బజార్ - బళ్ళారి - 1.

: సేల్సు డిపోలు :

చీరాల - గుంటూరు - కర్నూలు - అదోని - హుబ్లి.

మీ బిడ్డలకు వాడవలసినది

స్పెన్సర్స్

# గ్రైప్ సిరప్

పసిపిల్లల సమస్తమైన అజీర్ణ వ్యాధులకు








ఆంధ్రా స్టేట్‌కు
సోల్ డిస్ట్రిబ్యూటర్లు:

## ది స్వతంత్రా ఏజన్సీస్,

బొడ్డపాటివారి వీధి, గాంధినగర్, విజయవాడ-2.




సిలేటు




తెలుపు

పంచరంగుల

# బలపములు

*OTHER PRODUCTS*

● METALLO POWDER ● METALLO PASTE ● RUST-PROOF GREASE
● GRAPHITE CRUCIBLES ● ALUMINIUM WELDING FLUX

MANUFACTURERS:— *Indian Chemical And Ceramic Industries, Gandhinagar, Vijayawada - 2. (Andhra Pradesh)*

TRADE ENQUIRIES INVITED

SIST'S-SG-71-TEL

కొద్దిగా *టినోపాల్ తెల్ల బట్టలను

అన్నిటికన్నా అతి తెల్లగా జేయును




* "టినోపాల్" జె. ఆర్. గెయిగి ఎస్.ఎ. బాల్, స్విట్జర్లాండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

నిర్మించిన వారు: సుహృద్ గెయిగి ప్రైవేట్ లిమిటెడ్, వాడి వాడి, బరోడా. సోల్ డిస్ట్రిబ్యూటర్లు: సుహృద్ గెయిగి ట్రేడింగ్ ప్రైవేట్ లిమిటెడ్, పి.బి. బాక్సు నం. 965, బొంబాయి-1

ఆధునిక యంత్ర
పరికరములతోను
సాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ





ఆఫ్సెట్టు ప్రింటర్సు

ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

ప్రతినిధి కార్యాలయాలు:

కె. వి. డి. నివాస్, (3 వ ఫ్లోరు) ముగ్‌భాట్ వీధి, బొంబాయి-4. (ఫోన్: 75526)

డి/11, 5 మెయిన్ రోడ్, గాంధినగర్, బెంగళూరు-9. (ఫోన్: 6555)



మా జ్డ దీపములు

ఎక్కువ కాలము ప్రకాశవంతముగా వెలుగును







అసోసియేటెడ్ ఎలెక్ట్రికల్ ఇండస్ట్రీస్
(ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
హెడ్ ఆఫీసు: క్రౌన్ హౌస్, 6, మిషన్ రో, కలకత్తా
బ్రాంచీలు
బొంబాయి, న్యూఢిల్లీ, మద్రాసు, బెంగుళూరు, కోయంబత్తూరు, నాగపూరు

నియమించబడ్డ డీలర్లు: AIC 208 TE

రఘునాధ ట్రేడింగ్ కార్పొరేషన్, గుంటూరు. :: మచ్‌కుండ్ ఎలెక్ట్రికల్ స్టోర్సు, విజయవాడ-2.
మోటార్స్ & జనరల్ స్టోర్స్ ప్రైవేట్ లిమిటెడ్, బొబ్బిలి.



## ఎక్కడ విన్నా న్యూట్రిన్ ప్రశంసే!







పిల్లలకు న్యూట్రిన్ "డ్రమ్" అంటే ఎంతో యిష్టం. ఏమంటే, న్యూట్రిన్ కంపెనీవారు అందముగా ప్యాక్ చేయుటలో కొత్త పద్ధతిని అవలంబిస్తున్నారు. అత్యంత రుచికరమైన న్యూట్రిన్ మిఠాయిలు, టాఫీలు ఒక ఆకర్షణీయమైన పెట్టెలో అమర్చబడిన్ని, ఖరీదు హెచ్చింపబడక, మామూలు వెలకే అన్ని చోటులందు లభిస్తున్నవి.



మీ మధురానందమునకు:

ది న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కో., లిట్.,

చిత్తూరు - (ఆంధ్ర ప్రదేశ్)




Remy
BORATED
TALCUM POWDER

Remy
SNOW

మాలిని

Aykan

రెమి పౌడర్ & స్నో



నాణ్యతయే
నమ్మకమును
కలిగించును



# VUMMIDIAR'S

VUMMIDI RAMIAH CHETTY
GURUSWAMY CHETTY & Co

ఉమ్మిడి రామయ్యచెట్టి గురుస్వామిచెట్టి అండ్ కో.,
నగల వర్తకులు - వెండిపనివారలు
23-25, నేతాజీ సుభాషచంద్రబోస్ రోడ్డు, మద్రాసు - 1

సొగసుకు
సౌఖ్యానికి
మా సరికొత్త



*Embassy & Krislin*

మర్సిరైజు సూటింగులు
మేలైన నేత, మెరుగు,
నాణ్యత కలిగి
ఆనందదాయకమైన అనేక
రంగులలో అతి సరసమైన
వెలలకు దొరకును.




మర్సిరైజ్డ్ సూటింగులు, షర్టింగులు, పాప్లిన్సు-టస్సోర్సు

శ్రీకృష్ణా స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్సు (ప్రైవేట్) లి., బెంగళూరు-2.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికతో "చందమామ"కు పన్నెండేళ్లు నిండాయి. ఇన్ని ఏళ్లుగా పాఠకులైన మీరు "చందమామ" ఎడల చూపుతూ వస్తున్న ఆదరాభిమానాలకు మేమెంతైనా కృతజ్ఞులము.

మీరు నెల నెలా "చందమామ"లో అనేక రకాల రచనలు—త్రివర్ణ చిత్రాలుగల సీరియల్ కథలూ, షేక్స్పియర్ నాటకకథా, బేతాళకథా, ఇతర కథలూ, ఒకపేజీ కథలూ, వినోదాలూ, వైజ్ఞానిక వ్యాసాలూ, గేయకథా, చిత్రకథా మొదలైనవి—చదువుతున్నారు. వీటిలో మీకు ఏవేవి హెచ్చుగా నచ్చాయో, ఏవేవి నచ్చలేదో మాకు కార్డు ద్వారా తెలిపినట్టయితే మేము ముందు ముందు "చందమామ"ను మరింత ఆకర్షవంతంగా తయారు చేయగలుగుతాము. కనుక మాయందు దయఉంచి పాఠకులందరూ తమ తమ అభిప్రాయాలను మాకు తెలుప ప్రార్థన.

సంపుటి 24 : జూన్ 1959 : సంచిక 6



SANKAR




ఈవిధంగా అంబ మునులతో మాట్లాడే సమయంలో అక్కడికి హెూత్రవాహనుడనే రాజర్షి వచ్చాడు. అక్కడి మునులు ఆయనకు అర్ఘ్యపాద్యాలిచ్చి ఆసనంపైన కూచోబెట్టి తిరిగి అంబను గురించే ముచ్చటించసాగారు. వారి సంభాషణద్వారా అంబ కథ యావత్తూ తెలుసుకున్నవాడై హెూత్రవాహనుడు చప్పున తన ఆసనంమీదినుంచి లేచి అంబను అలింగనం చేసుకుని, "తల్లీ, నేను మీ అమ్మకు తండ్రిని, నీకు తాతను. నీకు కలిగిన కష్టమేమిటో వివరంగా చెప్పు!" అంటూ ఆమెను ఊరడించాడు.

అంబ తన వృత్తాంతమంతా హెూత్రవాహనుడికికూడా చెప్పింది. అంతా విని ఆయన, "అమ్మా, నువు మీ తండ్రి ఇంటికి వెళ్లటం ఎంతమాత్రమూ ఉచితంకాదు. నీకు కలిగిన దుఃఖానికి తగిన విరుగుడు నేను చేస్తాను. నువు నావెంటనే ఉండు. కాని తపస్సు చెయ్యటం నీవల్ల అయేపని కాదు. ఆ ప్రయత్నం మానుకో. జమదగ్ని కొడుకైన పరశురాముడున్నాడే అతని వద్దకు వెళ్లు. అతడితో నీకు జరిగిన అన్యాయం గురించి చెప్పు. అతను వెళ్లి భీష్ముణ్ణి అవలీలగా చంపేస్తాడు. ఇప్పుడు పరశురాముడు మహేంద్రపర్వతంమీద మహెూగ్రమైన తపస్సు చేస్తున్నాడు. నాకూ అతనికీ స్నేహం. నేను పంపించానంటే నిన్ను ఎంతో ఆదరించి నీ కష్టాలు తొలగిస్తాడు!" అన్నాడు.

ఇంతలో అక్కడికి అకృతవ్రణుడనే మహర్షి వచ్చాడు. అకృతవ్రణుడు పరశురాముడి అనుచరులలో ఒకడు. ఆయన రాగానే మునులందరూ లేచి స్వాగతం చెప్పారు. ఆయన అర్ఘ్యపాద్యాదులు స్వీకరించి, ఉన్నతాసనంమీద కూచుని, తన చుట్టూ కూచున్న మునులతో వేదాంత చర్చలు చేయసాగాడు.





ఆ సందర్భంలో హోత్రవాహనుడు అకృతవ్రణుణ్ణి పరశురాముడి యోగ క్షేమాలు అడిగి, "ఆయన ప్రస్తుతం ఎక్కడ ఉంటున్నాడు?" అన్నాడు.

"ఆయన తరచు మిమ్మల్ని తలుచు కుంటూ ఉంటాడు. మిమ్మల్ని చూసే ఉద్దేశంతో ఇక్కడికి వస్తున్నాడు. రేపు ఉదయానికి రావచ్చు ననుకుంటాను. ఈ పిల్ల ఎవరు? మీకు బంధువురాలా?" అంటూ అకృతవ్రణుడు అంబను గురించి ప్రశ్నించాడు. హోత్రవాహనుడు అంబ కథ చెప్పిన మీదట ఆయన అంబతో, "అమ్మాయీ, నీ కష్టాలకు కారకులు ఇద్దరే ఉన్నారు. ఒకడు నిన్ను బలాత్కారంగా తెచ్చిన భీష్ముడు, రెండోవాడు నిన్ను పెళ్లాడ నిరాకరించిన సాళ్వరాజు. వీరిలో ఎవరిపైన పగ తీర్చుకుంటావో ముందే తేల్చుకుని పరశురాముడితో చెప్పటం మంచిది," అన్నాడు.

అంబ ఏమనటానికీ నిశ్చయించలేక, "మహాత్మా, నా కథ అంతా మీరుకూడా విన్నారుగదా! నాకు దుఃఖం కలిగించిన ఆ ఇద్దరిలో ఏ ఒకరిని శిక్షించాలో, లేక ఇద్దరినీ శిక్షించాలో మీరే తేల్చండి!" అన్నది.

దానికి అకృతవ్రణుడు, "నా బుద్ధికి భీష్ముడే దోషి అని తోస్తున్నది. అతన్ని పరశురాముడు చంపినట్టయితే నీ పగ తీరుతుంది," అన్నాడు. "నాకూ అలాగే తోస్తున్నది," అన్నది అంబ.

ఆ రాత్రల్లా ఆశ్రమవాసులు అంబను గురించే మాట్లాడుకున్నారు.

మర్నాడు తెల్లవారుతూనే పరశురాముడు తన శిష్యులతోసహా ఆ ఆశ్రమానికి వేంచేశాడు. మునివేషంలో ఉన్నప్పటికీ ఆయనవెంట విల్లూ, ఖడ్గమూ, గండ్రగొడ్డలీ ఉన్నాయి. పరశురాముడి రాకవల్ల ఆశ్రమమంతా సందడి చెలరేగింది. ఆయనకు మునులందరూ తగినట్టుగా స్వాగత సన్మానాదులు జరిపినాక హోత్రవాహనుడు





ధరించనని వ్రతం పట్టాను. అలాటప్పుడు నీకోసం భీష్ముణ్ణి ఎలా చంపగలను? అదీ గాక భీష్ముడు నాకు ఎల్లప్పుడూ భృత్యుడై ఉంటాడు. నే నేది చెయ్యమంటే అది చేస్తాడు. అందుచేత అతన్ని చంప నవసరం లేదు," అన్నాడు.

అంబను తీసుకుని భీష్ముడివద్దకు వెళ్ళి, ఆమెను పెళ్ళి చేసుకోమని అడగటానికీ, భీష్ముడు నిరాకరించినట్టయితే అది బ్రాహ్మణ నిరసన అవుతుంది గనక భీష్ముడితో యుద్ధం చెయ్యటానికీ పరశురాముడు నిశ్చయించాడు.

అంబను చూపి ఆమెను పరశురాముడికి పరిచయం చేశాడు.

అంబ ఆయన కాళ్లపై పడి, భోరున ఏడుస్తూ ఆయన శరణు జొచ్చింది.

"అమ్మా, నీకు హొూత్రవాహనుడు ఎలాగో నేనూ అలాటివాణ్ణే. నీ కోరిక ఏమిటో చెప్పు, నేను తీరుస్తాను!" అన్నాడు పరశురాముడు.

"మహాత్మా, భీష్ముడు జీవితం ధ్వంసం చేశాడు. ఆయనను వధించి నా దుఃఖం తీర్చండి," అన్నది అంబ.

దానికి పరశురాముడు, "అమ్మాయీ, నేను బ్రాహ్మణ రక్షణకు తప్ప ఆయుధం

పరశురాముడు చేసిన ఈ నిర్ణయం ఆశ్రమవాసులందరికీ సంతోషం కలిగించింది.

పరశురాముడు ఆ రాత్రి ఆశ్రమంలో విశ్రమించి మర్నాడు వారందరినీ అంబనూ వెంటబెట్టుకుని కురుక్షేత్రానికి వచ్చి సరస్వతీ నదీ తీరాన విడిది చేశాడు.

పరశురాముడు తాను కురుక్షేత్రానికి వచ్చిన మూడోనాడు భీష్ముడికి కబురు చేశాడు. భీష్ముడు ఎంతో ఆనందోత్సాహాలతో పరశురాముణ్ణి చూడవచ్చాడు. భీష్ముడు చేసిన పూజలన్నీ అయాక పరశురాముడు, "భీష్మా! ఏం పని చేశావు? బ్రహ్మచారిగా ఉండగోరిన నీవు ఈ కాశీరాజు కుమార్తెను







బలాత్కారంగా తెచ్చావు. తెచ్చినవాడివి నీ ఇంట ఉంచుకోక సాళ్వుడివద్దకు పంపావు. నీవు అంటిన కన్య అని అతను ఈమెను నిరాకరించాడు. ఈమె నీ మూలంగా దిక్కు లేని ప్రాణి అయిపోయింది. అందుచేత నీవే ఈమెను వివాహమాడి ఈమె జీవితం నిల బెట్టు. ఇది నీకు నా ఆజ్ఞ!" అన్నాడు.

పరశురాముడి ఆగ్రహం గ్రహించి భీష్ముడు, "మహర్షీ! ఈమె తాను అదివరకే సాళ్వుణ్ణి వరించానని చెప్పటంచేత నే నీమెను నా తమ్ముడికిచ్చి చేయక సాళ్వుడి వద్దకు పంపేశాను. అది నా దోషం కాదు. ఇక నేను పెళ్లాడేది కల్ల. భయానగాని, లోభానగాని, జాలిచేతగాని, మోహంచేతగాని నేను ప్రతభంగం చెయ్యను!" అన్నాడు.

పరశురాముడు రౌద్రంగా, "ఏమోయ్, నామాట కెదురు చెబుతావా? నా ఆజ్ఞ శిరసావహించకపోతే నిన్నూ, నీ మంత్రు లనూ నాశనం చెయ్యగలను, జాగ్రత్త!" అని భయపెట్టాడు.

ఆయనను శాంతపరచటానికి భీష్ముడు ఎన్ని యత్నాలు చేసినా ఫలితంలేక పోయింది. చివరకు భీష్ముడు ఆయనకు ప్రణామం చేసి, "స్వామీ, నేను పసివాణ్ణి. మీరు నాకు నాలుగు రకాల అస్త్రాలు ప్రసా దించిన గురువులు. అలాటప్పుడు నన్ను యుద్ధానికి కవ్విస్తున్నారు, కారణమేమిటి?" అని వినయంగా అడిగాడు.

"నేను నీకు గురువునే అనుకుంటే నా మాట ఎందుకు వినవు? నీ మూలంగా ఈ పిల్లను ఎవరూ పెళ్లాడని పరిస్థితి ఏర్పడి నప్పుడు, నీవే ఈమెను వివాహమాడటం ధర్మం కాదా. నీ మేలు కోరే చెబుతున్నాను, నా మాట విని, ఈమెను పెళ్లాడు!" అన్నాడు పరశురాముడు.

"స్వామీ, ఈమె ఇంకొకరిని వరించిన కన్య, ఒకసారి నాచేత వదలబడినది. అలాటి దాన్ని నేను ఎన్నటికీ భార్యగా స్వీకరించను.



మీరు నాకు గురువులు, బ్రాహ్మణులు, తపోధనులు. అందుచేత మిమ్మల్ని వధించటం ఇష్టంలేక ఇంతగా మిమ్మల్ని బతిమాలుకున్నాను. మీరు కోపోద్రేకంలో క్షత్రియ ధర్మం అవలంబించి నాపై ఆయుధం ఎత్తితే మిమ్మల్ని సంహరించటం నాకు ధర్మవిరుద్ధం కాదు. అందుకు నేను జంకను కూడా!" అన్నాడు భీష్ముడు.

"నీకు నాతో యుద్ధం చెయ్యాలని ఉబలాటంగా ఉన్నట్టుంది. రేపు యుద్ధసన్నద్ధుడవై కురుక్షేత్రానికి రా. నిన్ను యముడి దగ్గిరికి పంపేస్తాను," అన్నాడు పరశురాముడు.



భీష్ముడు ఆయనకు ప్రణామంచేసి హస్తినాపురానికి తిరిగి వచ్చి సత్యవతితో జరిగినదంతా చెప్పాడు.

"విజయం పొందు, నాయనా!" అని సత్యవతి భీష్ముణ్ణి దీవించింది.

మర్నాడు భీష్ముడు బ్రాహ్మణులచేత స్వస్తిపుణ్యాహాలు చేయించుకుని యుద్ధసన్నద్ధుడై, తెల్లగుర్రాలు పూన్చిన వెండి రథంమీద సమస్త ఆయుధాలూ ఉంచుకుని, తెల్లని దుస్తులు ధరించి, తెల్లని గొడుగుతో కురుక్షేత్రానికి వచ్చాడు.

అప్పటికే పరశురాముడు, మునులు, బ్రాహ్మణులు వెంట రాగా, కురుక్షేత్రానికి వచ్చి ఉన్నాడు. ఆయనను చూస్తూనే భీష్ముడు శంఖం పూరించాడు. ఆ సమయంలో గంగ తన కుమారుడైన భీష్ముడి వద్దకు వచ్చి, "నాయనా, నువు పరశురాముడితో యుద్ధం చేయుటమేమిటి? ఇటువంటి ప్రయత్నం మాను!" అన్నది.

భీష్ముడు చేతులు జోడించి, "అమ్మా, జరిగినదంతా నీకు తెలిసే ఉంటుంది. ఈ విషయంలో నా తప్పు ఏమి ఉన్నా ఈ యుద్ధం మానేస్తాను," అన్నాడు.

తరవాత గంగ పరశురాముడితోకూడా చెప్పిచూసింది, కాని పరశురాముడు



వినలేదు. తరవాత భీష్ముడు రథం దిగి కాలినడకను పరశురాముణ్ణి సమీపించి, "మహాత్మా! నేను రథంతో వచ్చాను, కవచం ధరించాను. మీరుకూడా నాలాగే రథకవచాలు తెచ్చుకోండి. అలా అయితే నాకు మీతో యుద్ధంచెయ్యాలని ఉత్సాహం ఉంటుంది!" అన్నాడు.

"భీష్మా, నాకు భూమే రథం; వేదాలే గుర్రాలు; సావిత్రీ గాయత్రీ సరస్వతులు నాకు కవచాలు; వాయుదేవుడే నాకు సారథి," అన్నాడు పరశురాముడు. మరు క్షణం భీష్ముడికి ఆయన ఒక రథంమీద కనపడ్డాడు. పరశురాముడి ముఖ్యానుచరు డైన అకృతవ్రణుడు ఆయనకు సారథిగా ఉన్నాడు! భీష్ముడు ఆశ్చర్యపడుతూ పరశురాముడికి మొక్కి, "స్వామీ, మీరు నాతో సమానులైనా, నాకన్న అధికులైనా సరే మీతో యుద్ధం చెయ్యబోతున్నాను. గురువులైన మీరు, ఈ యుద్ధంలో నాకు జయం కలగాలని ఆశీర్వదించవలసిందిగా కోరుతున్నాను!" అన్నాడు.

"భీష్మా, నీకన్న పెద్దవాడినైన నావద్దకు కాలినడకను వచ్చి నాకు ముందుగా వందనం చెయ్యటం బాగానే ఉన్నది. కాని నీకు ఈ యుద్ధంలో విజయం కలగాలని




నేను ఆశీర్వదించను. నిన్ను యుద్ధంలో ఓడించటానికి కృతనిశ్చయుణ్ణయి వచ్చాను," అన్నాడు పరశురాముడు.

తరవాత ఇద్దరూ యుద్ధం ప్రారంభించారు. అది కావటానికి ద్వంద్వ యుద్ధమేగాని మహాభయంకరమైన యుద్ధం. ఇద్దరూ అస్త్రశస్త్రాలలో ఆరితేరిన యోధులు. వారు ఎన్నోసార్లు ఒకరినొకరు మూర్ఛ పోగొట్టారు. కాని ఇరవైమూడు రోజులు జరిగినా ఈ యుద్ధంలో ఎవరికీ విజయం దక్కలేదు.

ఇరవైమూడోనాటి రాత్రి భీష్ముడు ఈ యుద్ధం గురించి చాలా దిగులు పడ్డాడు.

ఆయన తన పితృదేవతలకూ, దేవతలకూ ఎన్నో దణ్ణాలు పెట్టుకుని, "నేనీ యుద్ధంలో గెలిచేది ఉంటే ఈ రాత్రి నాకు దేవతలు సాక్షాత్కరించాలి!" అనుకున్నాడు. ఆయన అనుకున్నట్టుగానే కలలో ఆయనకు ఎనిమిదిమంది బ్రాహ్మణులు కనిపించారు. ఒకనాడు భీష్ముడు యుద్ధరంగంలో మూర్ఛపోయినప్పుడుకూడా ఈ బ్రాహ్మణులే కనిపించి తనను పడకుండా పట్టుకుని రక్షించినట్టు ఆయనకు తోచింది. ఈ బ్రాహ్మణులు భీష్ముడితో, "భయపడకు. ఈ యుద్ధంలో నీవు గెలిచితీరుతావు. మా ఎనిమిది మందికీ నీవే శరీరానివి. ప్రస్వాపనం అనే అస్త్రాన్ని నీవు పూర్వజన్మలో ఎరుగుదువుగాని ఈ జన్మలో మరిచావు. దాన్ని ఇప్పుడు జ్ఞాపకం చేస్తున్నాము. ఈ అస్త్రాన్ని ప్రయోగించినట్టయితే పరశురాముడు చచ్చిపోడుగాని, చచ్చినట్టు పడిపోతాడు! నీకు విజయం లభిస్తుంది," అని చెప్పారు.

ఇరవైనాలుగోనాటి యుద్ధం మహా భయంకరంగా జరిగింది. మధ్యలో భీష్ముడు ప్రస్వాపనం అనే అస్త్రాన్ని తీసి పరశురాముడిపైన ప్రయోగించబోయాడు. ఆకాశంనుంచి అదృశ్యంగా యుద్ధాన్ని చూస్తున్న దేవతలు హాహాకారాలు చేశారు. "భీష్మా! వద్దు, వద్దు!" అన్న కేకలు వినిపించాయి. నారదుడు భీష్ముడి ఎదట ప్రత్యక్షమై, "భీష్మా, పరశురాముడు పెద్దవాడు, బ్రాహ్మణుడు, మీదుమిక్కిలి నీకు గురువు. ఈ అస్త్రాన్ని ప్రయోగించావంటే ఆయనకు తీరని అవమానం జరుగుతుంది. అందుచేత నా మాట విని తక్షణం ఈ అస్త్రాన్ని ఉపసంహరించు!" అన్నాడు.

భీష్ముడు అస్త్రం వేస్తున్నాడని తెలిసి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించిన పరశురాముడు కూడా భీష్ముడితోబాటు తన అస్త్రాన్ని ఉపసంహరిస్తూ, నోరుజారి, "బుద్ధిహీనుణ్ణి అయి భీష్ముడి చేతిలో ఓడాను!" అనేశాడు.






## 12

[ శంఖుడు వుండే కొండప్రాంతాన చంద్రవర్మ, కాపాలినిని కలుసుకున్న తరవాత వాళ్లిద్దరూ కలిసి శంఖుణ్ణి హతమార్చేందుకు వ్యూహం పన్నారు. సూర్యోదయంవేళ కొండ చివరికి వచ్చిన శంఖుణ్ణి, చంద్రవర్మ కొండకింది అగాధంలోకి జారి పడేలా చేశాడు. కాలనాగు, అగ్నిపక్షిని తుదముట్టించింది. అగాధంలోకి పడిపోయే ముందు శంఖుడు తన మంత్రదండం విసిరి, మంత్రగృహాన్ని సరస్సులో కూలేటట్టు చేశాడు. తరవాత—]

మాంత్రికుడైన శంఖుడు, 'మోసం! ద్రోహం!' అంటూ ఎలుగెత్తి కేకపెట్టి, చేతిలో గల మంత్రదండాన్ని, మంత్రగృహంకేసి విసరటం చూస్తూనే, కాపాలిని కుప్పలా కూలిపోయింది. ఇంతలో శంఖుడి మంత్రగృహం పెళపెళారావాలతో పునాదులనుంచి కదిలి, గాలిలోకి లేవటం చూసి చంద్రవర్మ నివ్వెరపోయాడు. అతడు తన నివ్వెరపాటు నుంచి కోలుకొనే లోపలే మంత్రగృహం దభీమంటూ సరస్సులో పడిపోయింది. భయాశ్చర్యాలతో నిలువెల్లా వణికిపోయిన చంద్రవర్మ, కాపాలిని తన పక్కన నిస్త్రాణగా కూలబడటం చూడలేదు.

"వర్మా!" అన్న సన్నని పిలుపు వింటూనే చంద్రవర్మ ఏదో మైకంనుంచి బయటపడిన వాడిలా అయి, కాపాలినికేసి చూశాడు. కాపాలిని తన పక్కన వున్న బండరాళ్లలో ఒకదాన్ని ఆసరాగా పట్టుకుని లేచేందుకు



ప్రయత్నిస్తున్నది. చంద్రవర్మ ఆమెకు చేయి అందించి సాయపడ్డాడు.

"వర్మా, నన్ను పట్టి పీడిస్తున్న దురదృష్ట దేవతే నిన్నూ పట్టినట్టున్నది. శంఖుడు ఆఖరి క్షణంలో మన ప్రయత్నానికి విఘాతం కలిగించాడు. ఇప్పుడు నీవూ నేనూకూడా పూర్వపు నిస్సహాయ స్థితిలోనే వున్నాం. ఉన్నచోటు వదిలి, అనేక ప్రమాదాలకు లోనై ఈ శంఖుడి కొండను చేరిన నీకూ నాకూ కూడా చివరకు మిగిలింది, నిరాశా నిస్పృహలే," అన్నది కాపాలిని.

కాపాలిని అలా మాట్లాడేసరికి చంద్రవర్మ తన ప్రయత్నం విఫలమయిందని



గుర్తించాడు. అతడు మంత్రగృహం పడటం వల్ల సరస్సులో ఉవ్వెత్తుగా లేచిన అలల కేసి నిట్టూర్పుతూ చూసి, "కాపాలినీ! మంత్రగృహంతోపాటు అపూర్వ శక్తులు గల శంఖంకూడా సరస్సులో పడిపోయిందనేనా నీ అనుమానం?" అని అడిగాడు.

"అనుమానం కాదు, వర్మా! జరిగిందే అది. శంఖుడి మంత్రగృహంలో ఆ అపూర్వ శక్తులు గల శంఖం వొకటే కాదు....ఇంకా అనేక మహాశక్తివంతమయిన వస్తువు లున్నవి. నేను కోరిందల్లా ఆ ఒక్క శంఖమే. కాని, నీకు నీ రాజ్యాన్ని శత్రువులనుంచి సునాయాసంగా గెలిచిపెట్టగలిగిన అపూర్వ వస్తువులెన్నో, మంత్రగృహంతోపాటు సరస్సు పాలయినై. ఇప్పుడు మన యిద్దరమూ గొంగళి సామెతగా, వేసిన చోటనే వున్నాం," అన్నది కాపాలిని.

చంద్రవర్మ, ఆఖరి క్షణంలో చేజారి పోయిన అపూర్వ వస్తువుల్ని తలుచుకుని ఓ క్షణకాలం నిశ్చేష్టుడై, అంతలోనే గుండె దిటవు చేసుకుని, "కాపాలినీ, గతించి పోయినదానికి యిప్పుడు విచారించి లాభం లేదు. క్రూరకర్ముడైన మాంత్రికుణ్ణొకణ్ణి యమపురికి పంపాం, అంతేచాలు," అంటూ అప్పుడే ఏదో గుర్తుకు వచ్చినవాడిలా కళ్లింత





చేసుకుని ఆమెకేసి చూస్తూ, "ఆ శంఖం నీటి పాలయిందిగదా? ఇప్పుడు నీ వృద్ధాప్యాన్ని పోగొట్టి, నీకు తిరిగీ జవసత్వా లిచ్చే వస్తువు కోసం ఎక్కడ వెతకటం?" అన్నాడు.

"ఎక్కడ వెతికినా ఆ శంఖంలాంటిది మరొకటి దొరికే అవకాశం లేదు, వర్మ!" అన్నది కాపాలిని నిస్పృహగా. "నేను యిప్పటికే మామూలు మానవు లెవరూ జీవించనంత కాలం జీవించాను. యిదే విధంగా బతుకుతూ పోవాలన్న ఆశకూడా నాలో నశిస్తున్నది. యింకా ఎంతకాలం బతికితేమాత్రం కొత్తగా నేను అనుభవించ బోయే సుఖాలు ఏమున్నవి గనక? ఇప్పుడు నా విచారమంతా నిన్ను గురించే. నాకోసం నీవు చాలా శ్రమపడ్డావు, ప్రాణాపాయాని క్కూడా గురయావు. అటువంటి నీకు ప్రతిగా నేను ఎలాంటి సహాయమూ చేయ లేని నిర్భాగ్య స్థితిలో వున్నాను," అన్నది.

ఈ మాటలు చంద్రవర్మలో ఆమెపై ఎంతో జాలినీ, గౌరవాన్నీ కలిగించినై. ఆమె శంఖుడి నుంచి అపూర్వశక్తులు గల శంఖాన్ని సంపాయించేందుకు ఎన్నేళ్లగానో ప్రయత్నించి, అది విఫలం అయిందని గుర్తించికూడా అంత విచారపడటం లేదు. ఆమెను యిప్పుడు పట్టి బాధిస్తున్నదల్లా



తనకు తిరిగి రాజ్యం సంపాయించుకునేం దుకు సహాయపడ లేకపోయానన్నదే.

"కాపాలినీ! నీవు నాకు చేసిన సహాయం కూడా చాలా వున్నది. నేను నదిలో పడి, నీవున్న అడవిప్రాంతాలకు చేరినప్పుడు, నాకు మరణం తథ్యం అనిపించింది. కాని, నీవు నీ గృహంలో నాకు ఆశ్రయం యిచ్చి, ఎంతగానో తోడ్పడ్డావు. నీకు నేను కలకాలం కృతజ్ఞుడనై వుండేందుకు ఆ సహాయం చాలు. సరే, యిప్పుడు మనం చేయవలసిన దేమిటి?" అన్నాడు చంద్రవర్మ.

కాపాలిని, కొండమీదికేసి దృష్టిని సారించి, "వర్మా! ఇక మనిద్దరి మార్గాలూ వేరు





కాక తప్పదనుకుంటాను. నేను మిగిలివున్న కొద్దికాలాన్నీ యీ కొండపైనే గడుపుతాను. జీవితపు ఆఖరిదశలోనైనా స్థిమితంగా ఒక చోట వెళ్లబుచ్చటం మేలని భావిస్తున్నాను," అన్నది విచారంగా.

"అలా అయితే, యీ కొండమీద ఒక మంచి చోటుగా చూసి, అక్కడ నీకోసం గృహం నిర్మించేందుకు నేనూ, కాలనాగూ ప్రయత్నిస్తాం. కొండమీదికి వెళదామా?" అన్నాడు చంద్రవర్మ.

కాపాలిని సరేనన్నట్టుగా తల వూపింది. చంద్రవర్మ రాళ్లమధ్యన వున్న కాలిబాట వెంట కొండమీదికి బయలుదేరాడు. అతడికి



వెనకగా కాపాలినీ, కాలనాగూ రాసాగారు. చంద్రవర్మ తను శంఖుణ్ణి అగాధంలోకి పడేలా చేసిన తూర్పువైపున గల కొండ అంచుదగ్గిరకు రాగానే, అక్కడ ఆగి, కిందికి తొంగి చూశాడు. అతడి దృష్టికి అగాథం అడుగున బండరాళ్లమీద బోర్లా పడివున్న శంఖుడు కనిపించాడు. ఓ క్షణ కాలం చంద్రవర్మ దృష్టిని మరల్చకుండా అతడికేసి చూసేంతలో, శంఖుడి చేయి ఒకటి కొంచెంగా కదిలినట్టు అతడికి అను మానం కలిగింది. ఆ వెంటనే చంద్రవర్మలో ఆ క్రూరమాంత్రికుడిమీద ఎక్కడ లేని ద్వేషం పుట్టుకొచ్చింది.

చంద్రవర్మ తనను సమీపిస్తున్న కాపా లినికేసి తిరిగి, "కాపాలినీ! ఆ పాపి శరీ రంలో యింకేపాటో జీవం వున్నట్టు నా కను మానంగా వున్నది. ఒకవేళ వాడు తిరిగి బతకటం జరిగితే, మనకు ముప్పు తప్పదు. ఇదుగో, యీ రాతితో ఆ మాంత్రికుడి తలను చిన్నాభిన్నం చేస్తాను," అంటూ పక్కన వున్న ఒక పెద్ద రాతిని ఎత్తి గురిగా అగాధం లోకి వదిలాడు.

తరవాత చంద్రవర్మా, కాపాలినీ కొంత దూరం నడిచి ఒకప్పుడు శంఖుడి మంత్ర గృహం వున్న ప్రదేశానికి వచ్చారు. ఆ ప్రదే



శంలో యిప్పుడు ఆ గృహం వుండవలసిన చోట నిలువు లోతు పునాదులు మాత్రమే వున్నవి. చంద్రవర్మ వాటిని కాపాలినికి చూపుతూ, "నీకు కావలసిన గృహాన్ని యీ పునాదులమీదే నిర్మించవచ్చు. నీకు సమ్మతమేనా ?" అని అడిగాడు.

కాపాలిని అందుకు అంగీకరించింది. అప్పటికి సూర్యుడు తూర్పున రెండు మూడు బారలు పాకాడు. చంద్రవర్మ తూర్పు దిక్కుకేసి ఓమారు చూసి, "ఆకలి దహించుతున్నది. ఇంత ఆహారం తిని పని ప్రారంభించితే ఎంత బావుండును. పండ్లూ ఫలాలకోసం తిరిగి కొండ దిగాలి," అన్నాడు నిట్టూరుస్తూ.

చంద్రవర్మ బాగా అలసిపోయాడని గ్రహించిన కాపాలిని, కాలనాగుకేసి తిరిగి, "కాలనాగూ! ఇదుగో నీకు తిరిగీ నీ పూర్వ మానవరూపం యిస్తున్నాను. ఈనాటినుంచీ నీవు స్వేచ్ఛాజీవివి. నీ యిచ్ఛవచ్చిన చోటికి పోవచ్చు," అని ఏదో మంత్రం జపిస్తూ తన చేత గల మానవాస్తికతో కాలనాగు తలలను తాకింది. వెంటనే ఆరడుగుల ఎత్తూ, దృఢంగా చెట్టుబోదెల ప్రమాణంలో వున్న కాళ్లూ, బలమైన చేతులూ గల ఒక యువకుడు అక్కడ ప్రత్యక్షమయాడు.



"కాపాలినీ, నీ దయకు కృతజ్ఞుణ్ణి!" అన్నాడా యువకుడు. తరవాత చంద్రవర్మకేసి తిరిగి, "అయ్యా, మీ మేలు మరిచిపోలేను," అంటూ నమస్కరించాడు.

"లోగడ మానవరూపంలో వుండగా నీవు ఏపేరున పిలవబడేవాడివో నాకు తెలియదు. నాకు సర్పకేతుడనే శత్రువొకడున్నాడు. నీవు నామిత్రుడివి గనక, నీకు కాలకేతుడనే పేరు పెట్టదలిచాను," అన్నాడు చంద్రవర్మ.

"అవును, నన్ను కాలకేతుడనే పిలవండి! ఏనాటికైనా నేను మీ శత్రువైన ఆ సర్పకేతుణ్ణి బలి పుచ్చుకుని, కాలకేతుడనే






ఆ రాత్రికి ముగ్గురూ ఆ గృహంలోనే పడుకున్నారు. చంద్రవర్మకు నడిరేయి అయినా కునుకు పట్టలేదు. అతడు తన భావి కార్యక్రమాన్నిగురించి ఆలోచించ సాగాడు. తను కాపాలిని సహాయంవల్ల అపూర్వ శక్తులు సంపాయించి తిరిగి తన రాజ్యాన్ని జయించుకోవాలన్న ప్రయత్నం విఫలమయింది. తన తండ్రిని మోసగించి అతి క్రూరంగా హత్య చేసిన సర్పకేతుడు, యిప్పుడు మొత్తం మాహిష్మతిరాజ్యానికే రాజైవుంటాడు. అటువంటివాణ్ణి జయించా లంటే తనకు ఎంతో సైన్యం కావాలి. సైన్యాన్ని పోగుచేయటానికి ధనం ముఖ్యం. అంత ధనం తనకెక్కడ లభించేటట్టు?

చంద్రవర్మ యిలాంటి ఆలోచనలతో నిద్ర పట్టక ఒక రాత్రివేళ బయటికి పోయి వెన్నెలలో అటూ యిటూ తిరగసాగాడు. కొంచెంసేపటికల్లా కాలకేతుడు అతడి దగ్గిరకు వచ్చి, "అయ్యా, యింత రాత్రివేళ యిక్కడ వున్నారేమిటి? ఏ సమస్యను గురించి మీరింతగా ఆలోచిస్తున్నారు?" అని అడిగాడు.

"కాలకేతూ, నాకు అన్నీ సమస్యలే!" అన్నాడు చంద్రవర్మ. "నేను రాజ్యం పోగొట్టుకుని అడవుల పాలయానని నీకు

నామం సార్ధకం చేసుకుంటాను," అన్నాడు యువకుడు.

తరవాత కాలకేతుడు కొండ దిగి వెళ్ళి, సరస్సు ఒడ్డున గల పండ్లతోటలో వివిధ రకాల పండ్లు కోసుకుని వాటితో చంద్ర వర్మ, కాపాలిని దగ్గిరకు తిరిగి వచ్చాడు. ముగ్గురూ ఆ పండ్లు తిని దాపులనే వున్న సెలఏరులో నీరు తాగారు. కొంచెంసేపు విశ్రమించిన తరవాత చంద్రవర్మా, కాల కేతుడూ కలిసి శంఖుడి మంత్రగృహపు పునాదులమీదే కాపాలిని కోసం రాళ్లతో గృహం నిర్మించసాగారు. ఆ పని సూర్యా స్తమయ సమయానికల్లా పూర్తయింది.







తెలుసుగదా ? కాపాలినివల్ల సహాయం పొందగలననుకున్నాను. కాని, ఆఖరి నిమిషంలో శంఖుడు తన మంత్రగృహాన్ని సరస్సులో కూల్చటంద్వారా, అందరికీ ఆశాభంగం కలిగించాడు. నేను తిరిగి ఎక్కడికి పోయి, ఎవరినుంచి సహాయం కోరాలో తెలీక మథనపడుతున్నాను. ఈ చుట్టుపక్కల ఎంత దూరంలో మానవ నివాసాలున్నవో నీకు ఏమయినా తెలుసునా?" అని అడిగాడు.

"ఈ కొండల్లో, అడవుల్లో ఉత్తరదిక్కుగా ఒక్క నూరు యోజనాలు ప్రయాణిస్తే, మీరు తిరిగీ జనపదాలను చూడగలుగుతారు. నేను మీవెంట రావాలనుకున్నాను. కాని, కాపాలినిని నిస్సహాయంగా యీ కొండమీద ఒంటరిగా వదలటం నాకు మనస్కరించటం లేదు. ఆమె మరి ఎంతోకాలం బతకదు. ఆ తరవాత ఆమె తన పాతఇంట వదిలి వచ్చిన, భూతవర్తమాన కాలాలను ప్రతిఫలించే గాజుగోళం సహాయంతో మీదగ్గిరకు తప్పక వస్తాను. ఆ గాజుగోళం మీకూ ఉపకరించవచ్చు!" అన్నాడు కాలకేతుడు.

కాలకేతుడి మాటలు చంద్రవర్మకు ఏమాత్రం వుత్సాహం కలిగించలేదు. ఈ చుట్టుపక్కల వున్న కొండలూ అడవుల్లో నూరు యోజనాలు ప్రయాణం చేయగలిగితే అప్పుడు తను మనుషులు నివసిస్తున్న ప్రాంతాలకు చేరగలుగుతాడు. ఈ నూరు యోజనాల ప్రయాణంలో తను ఎన్ని భయంకర ప్రమాదాలకు గురి కావలసి వున్నదో ఆ ఈశ్వరుడికే ఎరుక!

చంద్రవర్మ సూర్యోదయంవరకూ యిలాంటి ఆలోచనలతోనే కాలం గడిపాడు. సూర్యోదయం కాగానే అతడు సరస్సులో స్నానంచేసి, కాపాలిని దగ్గిరకు వెళ్లి తన ప్రయాణాన్ని గురించి చెప్పాడు. కాపాలిని అతణ్ణి దీవించి, "వర్మా, నీవు ఎన్ని కష్టాలు ఎదుర్కొన్నప్పటికీ చివరకు శత్రుసంహారం



చేసి నీ రాజ్యాన్ని గెలుచుకొనగలవని నా దృఢవిశ్వాసం," అన్నది.

తరవాత చంద్రవర్మ కాపాలినికీ, కాల కేతుడికీ సెలవు చెప్పి కొండ దిగి, ఉత్తర దిక్కుగా మహారణ్యంలో నడవసాగాడు. అతడు ఆవిధంగా పొద్దు నడినెత్తికొచ్చే వరకూ నడిచి, బడలిక తీర్చుకునేందుకు ఒక మహావృక్షం కిందికి వెళ్లాడు. ఆ వృక్షం కింద పడుకునేందుకు చదునైన స్థలంకోసం గాలిస్తున్న చంద్రవర్మకు, వృక్షపాదంలో దాదాపు నాలుగడుగుల పొడవున్న ఒక ఇనపగొలుసు కనిపించింది. ఈ మహారణ్యంలో అలాంటి వస్తువు తన కంటబడి నందుకు అతడు ఆశ్చర్యపోతూ, ఆ గొలుసును చేతికి తీసుకుని పరీక్షించి చూశాడు. అది వాడుక లేనందున బాగా తుప్పుపట్టి వున్నది. ఆ ఇనపగొలుసు ఈ అరణ్యం మధ్యకు ఎలా వచ్చివుంటుంది? అని చంద్రవర్మ మథనపడుతున్నంతలో, దూరంగా మహా భయంకరమైన మొరుగు ఒకటి వినిపించింది.

ఆ మొరుగు వింటూనే చంద్రవర్మ ఒర నుంచి కత్తి దూసి లేచి నిలబడ్డాడు. దూరంగా కొండరాళ్లమీద కుప్పించి దూకుతూ, కోరలు సాచి తనకేసి వస్తున్న పెద్ద కుక్క ఒకటి అతడి కంటబడింది. "ఇది మామూలు కుక్క అయివుండదు, ఆ రూపంలో వున్న భయంకర రక్కసు డెవడో అయివుండాలి!" అనుకుంటూ చంద్రవర్మ కుడిచేతితో కత్తిని బిగించి పట్టు కుని, ఎడమచేతితో తనకు దొరికిన ఇనప గొలుసును పైకెత్తాడు. ఆ క్షణంలో ఆ ఇనప గొలుసుకూడా ఆత్మరక్షణకు ఉపకరించ వచ్చునని అతడికి తోచింది. ఇంతలో దయ్యపు కుక్క, ఎదురుగా వున్న పొద ల్లోంచి మరోసారి కర్ణకఠోరంగా మొరిగి, నోరు తెరిచి చంద్రవర్మ మీదికి శరవేగంతో రాసాగింది. —(ఇంకా వుంది)



# శత్రువుకు సహాయం

విసుగుచెందని విక్రమార్కుడు మరొకసారి చెట్టువద్దకు వెళ్లి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు నీ సహాయం కోరిన ఒక భిక్షువుకోసం ఇంత శ్రమపడటం ఆశ్చర్యకరమే గాని పరమ శత్రువుకుకూడా ఆపత్సమయంలో సహాయపడినవారున్నారు. ఇందుకు తార్కాణంగా నీకు మాలావతి కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

పూర్వం త్రిగర్తదేశానికి రాజయిన యశపాలుడి రాజ్యంలో చంద్రవర్మ అనే సామంత రాజు ఉండేవాడు. చంద్రవర్మది చాలా పురాతనమైన చంద్రవంశం. అందుచేత చంద్రవర్మ తాను ఒక రాజుకు లోబడి ఉన్నవాడైనప్పటికీ తన వంశ మర్యాదలను భక్తి శ్రద్ధలతో పాటిస్తూ ఉండేవాడు.



చంద్రవర్మకు ఇద్దరు కుమారులూ, మాలావతి అని కుమార్తే ఉండేవారు. వారు ముగ్గురూ వంశాభిమానం కలవారే.

త్రిగర్త రాజయిన యశపాలుడు చంద్ర వర్మలాగా పవిత్రమైన వంశంలో పుట్టిన వాడు కాడు. అయినా ఆయన పరిపాలనలో సమర్థుడు. తన దేశంలో ఎక్కడా అరాజక మన్నది తల ఎత్తకుండా వెయ్యి కళ్లతో కనిపెడుతూ, అశాంతిని ఎప్పటికప్పుడు నిర్దయగా అణచివేస్తూ ఉండేవాడు.

గంగాతీరాన కోట కట్టుకుని ఉన్న చంద్ర వర్మ గంగకు అవతల గల రాజుతో కుట్ర చేసి యశపాలుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చెయ్యాలని ప్రయత్నాలు చేస్తున్నట్టు ఒకసారి వేగుల వాళ్ల ద్వారా వార్త తెలిసింది.

వెంటనే యశపాలుడు శూరసింహుడనే సేనానిని ఒక పెద్ద సైన్యంతోసహా చంద్ర వర్మ ఉండే కోటకు పంపాడు.

చంద్రవర్మ శూరసింహుడికి ఘనమైన స్వాగతమిచ్చి, "మీరింత సేనతో దయ చెయ్యటానికి కారణమేమిటి? త్రిగర్త దేశానికి శత్రుభయం లేదుగద?" అన్నాడు.

శూరసింహుడుకూడా లౌక్యుడే. ఆయన చంద్రవర్మతో, "అలాటిదేమీలేదు. కాని గంగకు అవతలి తీరాన ఉన్న రాజులు కొందరు యుద్ధ సన్నాహాలు చేస్తున్నట్టు తెలియవచ్చింది. వారు దండెత్తివస్తే ముందుగా అపాయం మీకే. మహారాజు గారికి మీపై ఎంత అభిమానమంటే, ఆయన తన కుటుంబానికి ఆపద కలిగినా సహించ గలరు గాని మీ వంశానికి ప్రమాదం జరిగితే సహించలేరు. కొంతకాలం మీ కోటను కాపాడమని మహారాజుగారు నన్ను సైన్యంతోసహా పంపారు!" అన్నాడు.

చంద్రవర్మ తలవంచి, "మహారాజుగారికి ఎంతో కృతజ్ఞుణ్ణి!" అన్నాడు.

శూరసింహుడు చంద్రవర్మతో ఇంకా ఇలా అన్నాడు: "ఈ యువకుడు భద్రకీర్తి

మన ఉపసేనానులలో ఒకడు. ఇతనినీ ఒక వందమంది మెరికలలాటి భటులనూ మీ కుటుంబ రక్షణకుగాను ఇస్తున్నాను. వీళ్లు అహోరాత్రాలు మిమ్మల్ని కనిపెట్టుకుని ఉంటారు. ఆపద కలిగే పక్షంలో మీ ప్రాణాలకు తమ ప్రాణాలను అడ్డుపెట్టగలరు. భద్రకీర్తినీ, అతని భటులనూ కోటలో ఉంచుకోండి. నేనూ నా సైన్యమూ కూడా కోట వెలపల, నదీతీరాన శిబిరాలు నిర్మించుకుని ఉంటాం!"




చంద్రవర్మ శత్రురాజులతో చేరి కుట్ర చేసిన మాట నిజమే. కాని ఇప్పుడతని ఆట కట్టయింది. పైకి ఎంత ఇచ్చకాల మాటలు చెప్పినా శూరసింహుడు చంద్రవర్మను అతని కోటలోనే ఖైదీగా చేసివేశాడు. పైవారెవరైనా చంద్రవర్మను చూడవచ్చినా, చంద్రవర్మతో రహస్యంగా మాట్లాడినా, ఆఖరుకు చంద్రవర్మ తన కొడుకులతో రహస్యంగా మాట్లాడినా కూడా ఆ సంగతి భద్రకీర్తికి త్వరలోనే తెలుస్తుంది. భద్రకీర్తి అహోరాత్రాలు కాలు కాలిన పిల్లిలాగా కోట అంతటా కలయ తిరిగేవాడు.

అయినా చంద్రవర్మ తన ప్రయత్నాలను మానలేదు. ఆయన తన కొడుకులనే వేగుల వాళ్లుగా ఉపయోగించి కుట్ర సాగించాడు. అన్ని ప్రయత్నాలూ పూర్తి అయాయికూడా. సంవత్సరాది పండగనాడు చంద్రపురంలో రకరకాల వేడుకలు జరుగుతాయి. తెల్లవార్లూ సంబరం సాగుతుంది. ఆ చీకటిరాత్రి శత్రుసేనలు గంగ దాటి వచ్చేటట్టూ, చంద్రవర్మ సేనలు వారికి స్వాగతమిచ్చేటట్టూ ఏర్పాటయింది. తరవాత ఈ రెండు సేనలూ కలిసి శూరసింహుడి శిబిరంపై పడి అతడి సైన్యాలను సర్వనాశనం చేస్తాయి. ఇదే సమయంలో చంద్రవర్మ కుమారులు కోటలో ఉన్న భద్రకీర్తిని చంపేసి అతని భటులను మాయోపాయంతో కారాగృహంలో బంధించేస్తారు.

ఈ కుట్రను గురించి భద్రకీర్తికి కొంచెం కూడా తెలియదు. చంద్రవర్మా, ఆయన కొడుకులూ అతనిపట్ల ఎంతో ఆపేక్షగా ఉంటున్నారు. భద్రకీర్తికి వారిపైన అదివర కేదైనా అనుమానం ఉంటే అది కాస్తా క్రమంగా పోయింది.

దానికి ముఖ్యకారణం మాలావతి. ఆమె చాలా చక్కనిది. మొదటిసారి చూస్తూనే భద్రకీర్తి ఆమెను ప్రేమించాడు. ఆమె ఎన్నడూ అతనితో మాట్లాడలేదు గాని ఎన్నో సార్లు మాట్లాడబోయేదానిలాగా కనపడింది.

మాలావతిని తాను ప్రేమించటం వృథా అని భద్రకీర్తికి తెలుసును. ఎందుచేతనంటే అతను చంద్రవర్మకు గల వంశాభిమానం ఎరుగును. చంద్రవంశాన పుట్టిన రాజకన్య తనవంటి సామాన్య క్షత్రియుణ్ణి పెళ్ళాడటం కలలో వార్త. అందుచేత, మాలావతి తన కేసి చూసినాకూడా భద్రకీర్తి తన కెంతో గొప్పగౌరవం జరిగినట్టుగా సంతోషించాడు.

అయితే మాలావతి భద్రకీర్తిని నిజంగానే ప్రేమించింది. ఆమె ఎన్నడూ తమ కోటను విడిచి మరొక చోటికి వెళ్ళి ఎరగదు. ఆమెకు తన అన్నలు తప్ప మరెవరూ తెలియదు. అలాటి పరిస్థితిలో దేవుడు పంపిన అతిథి లాగా భద్రకీర్తి వచ్చాడు. అతను అందమైన వాడు, అతిశయాహంకారాలు లేక నమ్రతగా



ఉండేవాడు. వయసుకు చిన్నవాడైనా, యుద్ధరంగంలో తేరిచూడరాని యోధుడని అతన్నిగురించి ఆమె విని ఉన్నది.

అలాటివాణ్ణి సంవత్సరాది పుణ్యదినాన తన తండ్రీ, అన్నలూ చంపటానికి ప్రయత్ని స్తున్నారని తెలియగానే మాలావతి గుండె గుభేలుమన్నది. అతను తమ కుటుంబానికి శత్రువులాటివాడనీ, తమ స్వేచ్ఛను అరికట్టటానికే కోటలో వచ్చి ఉంటున్నాడనీ ఆమెకు తెలుసును. అయినా ఆమె అతన్ని ప్రేమించింది.

ఆ రాత్రి భోజనాలు కాగానే భద్రకీర్తి కోట బురుజుపైకి వెళ్లి చుట్టూ కలయ జూశాడు. అంతా ప్రశాంతంగా ఉన్నది. చీకటిలో గంగాప్రవాహం అస్పష్టంగా కని పిస్తున్నది. ఒక పక్కగా ఉన్న సైనిక శిబిరాలు మాత్రం చీకట్లో కానరావటంలేదు.

అతను మాలావతిని గురించే ఆలోచిస్తూ గంగవేపు చూస్తూండగా దానిపైన నల్లటి చుక్కల్లాగా ఏవో కనిపించాయి. అవన్నీ పడవలయితే ఆవేళప్పుడు అన్ని పడవలు గంగపై ఎందుకుంటాయి?

ఈ విషయం తేల్చుకునేటందుకుగాను అతను బురుజు దిగి వస్తుండగా అతనికి గాజుల చప్పుడు వినిపించింది. మరుక్షణం ఆ చీకటిలో మాలావతి అతన్ని సమీపించి,





"మా నాన్నా, అన్నలూ మిమ్మల్ని చంప టానికి ఇటే వస్తున్నారు. మీరు కోట గోడ మీదినుంచి ఎలాగో దిగి పారిపొండి!" అని రహస్యంగా చెప్పింది.

కోటగోడ బొత్తిగా నిటారుగా లేక కొంచెం ఏటవాలుగా ఉన్నది. భద్రకీర్తి గోడలోని రాళ్లను చేతివేళ్లతోనూ, కాలివేళ్ల తోనూ పట్టుకోవటానికి ప్రయత్నిస్తూ, మధ్య మధ్య జారుతూ, కిందికి దిగేసి, తమ శిబిరా లుండే దిక్కుగా పారిపోయాడు.

తరవాత కొద్దిసేపటికే చంద్రవర్మా, ఆయన కొడుకులూ మాలావతి ఉన్న చోటికి వచ్చి, "భద్రకీర్తి ఏడీ?" అని అడిగారు. "నన్ను చూస్తూనే అతను గోడ దిగి పారిపోయాడు" అన్నది మాలావతి.

చంద్రవర్మ తన భటులచేత భద్రకీర్తి భటులను ఒక్కొక్కరినే ఒక గదికి పిలి పించి, వారందరినీ అందులో బంధించే శాడు. అనుమానించి తిరగబడినవారిని చంద్రవర్మ భటులు చంపేశారు. ఈలోపుగా భద్రకీర్తి శిబిరంలో శూరసింహుణ్ణి కలుసు కుని తనకు తెలిసినదంతా చెప్పాడు.

"కుట్ర జరుగుతున్నదని గ్రహించక పోవటం నీదే తప్పు. నేను ముందే ఉప ద్రవం శంకించి కోటనుంచి చంద్రవర్మ సైనికులు కదలటానికి లేకుండా మన సైని కులను ద్వారంవద్ద కాపలా ఉంచాను. నువు చెప్పేదాన్నిబట్టి శత్రుసేనలుకూడా గంగదాటి వస్తున్నట్టు తెలుతున్నది. వారికి స్వాగతమివ్వటానికి మన సైన్యంలో సగాన్ని ఇప్పుడే పంపుతాను. నువు ఆ సేనలకు నాయకత్వం వహించు. నేను కోటకు స్వయంగా వెళ్లి చంద్రవర్మను పరామర్శి స్తాను," అన్నాడు.

భద్రకీర్తి కొంత సైన్యంతో గంగాతీరానికి వెళ్లాడు. అతను వెళ్లిన కొద్దిసేపటిలో ఒక వంద పడవలు ఒడ్డు చేరాయి. దాదాపు రెండువేలమంది శత్రుసైనికులు దిగారు.

చీకటిలో ఒడ్డునఉన్న మనుషులను చూసి శత్రుసైనికులు కుట్రదారులనే అనుకున్నారు. భద్రకీర్తి శత్రుసైనికులతో, "మీ ఆయుధాలన్నీ మా సైనికులపరం చెయ్యండి. కుట్ర ఫలించింది. శిబిరం అదివరకే మన వశమయింది. మనం నేరుగా శిబిరానికే పోవచ్చు!" అన్నాడు.

ఆ మాట్లాడేది చంద్రవర్మతాలూకు సైనికాధికారే అనుకున్నారు శత్రువులు. అతను చెప్పినట్టే చేసి వారంతా భద్రకీర్తికి ఖైదీలుగా చిక్కి శిబిరానికి తీసుకుపోబడ్డారు.

ఈ పని పూర్తికాగానే భద్రకీర్తి కోటకు తిరిగి వెళ్లాడు. అతను వెళ్లేసరికి చంద్రవర్మ, అతని కుమారులూ బందీలుగా చిక్కారు. వారికి శూరసింహుడు మరణదండనకూడా విధించాడు.

భద్రకీర్తి శూరసింహుడితో, "మహాసేనానీ, నాది ఒక్క మనవి. మాలావతి నా ప్రాణం కాపాడటమే గాక, తన తండ్రి తలపెట్టిన రాజద్రోహం భగ్నం కావటానికికూడా ఎంతో సహాయపడింది. ఆమెకు కారాగృహవిముక్తి కలిగించండి. నేనామెను పెళ్లాడదామనుకుంటున్నాను," అన్నాడు.

శూరసింహుడు మాలావతి విడుదలకు ఉత్తరువిచ్చాడు. ఆమెను విడిపించటానికి



భద్రకీర్తి స్వయంగా వెళ్లాడు. అతడు వెళ్లేసరికి మాలావతి కారాగృహంలో విచారంగా కూర్చొని ఉన్నది.

"మాలావతీ, నిన్ను చెరవిడిపించ వచ్చాను," అన్నాడు భద్రకీర్తి.

మాలావతి ఒకసారి అతనికేసి చూసి ముఖం తిప్పేసుకున్నది. ఆమెనుంచి ఎలాటి జవాబూ లేదు.

"నేను నీకేమైనా అపచారం చేశానా? నాకేసి ఎందుకు చూడవు? రాజద్రోహి కుమార్తెవన్న అపవాదు లేకుండా నిన్ను నేను పెళ్లాడతాను!" అన్నాడు భద్రకీర్తి. దానికికూడా ఆమె సమాధానం చెప్పలేదు.

"నాపైన ఇంత అనాదరం కలదానివి నా ప్రాణం ఎందుకు కాపాడావు? ఇంతకంటె మీ తండ్రి చేతిలో చనిపోతే నాకింకా ఎక్కువ సంతోషంగా ఉండేదే! ఇప్పుడైనా మించిపోలేదు. ఇదుగో నా కత్తి! దీనితో నన్ను చంపెయ్యి!" అన్నాడు భద్రకీర్తి.

మాలావతి చిరునవ్వు నవ్వుతూ లేచి అతన్ని సమీపించి, అతని కత్తి తీసుకున్నది. ఆమె మరుక్షణం ఆ కత్తిని తన గుండెల్లో పొడుచుకుని చనిపోయింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మాలావతి ఎందుకు ఆత్మహత్య చేసుకున్నది? ఆమె భద్రకీర్తిని ప్రేమించలేదా? అతని ప్రాణం కాపాడినందుకు పశ్చాత్తాపపడిందా? ప్రేమించిన మనిషి అయితే అతన్ని పెళ్లాడే అవకాశాన్ని జారవిడిచి ఆత్మహత్య చేసుకోవటానికి కారణమేమిటి? దీనికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

అందుకు విక్రమార్కుడు, "మాలావతి భద్రకీర్తిని ప్రేమించిన మాట నిజమే. అందుకే ఆమె అతని ప్రాణాన్ని కాపాడింది. అయితే అతన్ని ప్రేమించినంతమాత్రంచేత ఆమె కులద్రోహి అని అనుకోరాదు. వంశాభిమానం చంద్రవర్మకు ఎంత ఉన్నదో ఆమెకు కూడా అంతే వున్నది. తన ప్రేమమూలంగా వంశనిర్మూలనం జరగకపోయినప్పటికీ ఆమె అతన్ని పెళ్లాడి వంశానికి కళంకం తీసుకురాలేదు. అలాటప్పుడు వంశనిర్మూలనం అయాక, ఆమె తన ప్రేమ ఫలితాన్ని అనుభవించటానికి బతికి ఉండటమూ, భద్రకీర్తిని పెళ్లాడటమూ ఏ విధంగానూ సాధ్యమయే పనులు కావు. అందుకే మాలావతి చివరకు ఆత్మహత్య చేసుకున్నది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# అచ్చిరాని పాలెకాపు

చైనాలో ఒక మారుమూల గ్రామంలో ఒక భూస్వామి ఉండేవాడు. ఆయన పరమ కర్కోటకుడు. ఆయన కింద ఏ పాలెకాపూ ఎక్కువ రోజులు పని చేయలేకపోయేవాడు. ఆయన వాళ్లచేత పని చేయించుకున్నాళ్లు పని చేయించుకుని, తాను చెప్పిన పని సరిగా చెయ్యలేదని మిషపెట్టి ప్రతివాణ్ణీ డబ్బివ్వకుండానే పనిలోనుంచి పంపేస్తూ వుండేవాడు.

ఆ వూళ్లో ఆయనకింద ఎవరూ పని చేసేవాళ్లు కారు.

అయినా పొరుగూళ్లనుంచి అమాయకులు వచ్చి కొంతకాలం భూస్వామిదగ్గిర పని చేసి డబ్బులు ముట్టకుండానే వెళ్లి పోతూండేవాళ్లు.

ఒకనాడు దూరపు గ్రామంనుంచి ఒక కుర్రవాడు వచ్చి భూస్వామి ఇంట పని చేయటానికి కుదిరాడు.

"అబ్బాయీ, నీకు ముందే చెప్పటం మంచిది. నేను చెప్పిన పనులు చెప్పినట్టు చెయ్యకపోయావో నీకు కానీకూడా ఇవ్వను సరేగదా పనిలోనుంచి పంపేస్తాను. తరవాత విచారించి లాభంలేదు. తెలిసిందా ?" అన్నాడు భూస్వామి.

"దానికేం భాగ్యం లేండి! చెప్పిన పని చెయ్యకపోవటం తప్పేగా ?" అన్నాడు కొత్త పాలెకాపు.

వాడు పనిలో చేరి కోడి కూసింది మొదలు చీకటి పడినదాకా ఒళ్లు దాచుకోకుండా పని చేస్తూ వచ్చాడు.

ఒకనాడు భూస్వామి పాలెకాపుతో, "ఒరే, "కొండమీది వెదురుపొదలు ఆకు తొడిగాయి గాని, రేపు మన ఎద్దును తోలుకు పోయి వెదురు చిగుళ్లు మేపుకురా! నువు చిగుళ్లు కోసి ఎద్దు నోటికి అందించేవుసుమా. దాన్నే మెయ్యనీ!" అన్నాడు.

ఎస్. నారాయణరావు

"దానికేం భాగ్యం లేండి?" అన్నాడు పాలెకాపు.

మర్నాడు ఉదయమే వాడు ఎద్దును తోలుకుని కొండమీది వెదుళ్లపొదల దగ్గిరికి తీసుకుపోయి, దాన్ని ఒక వెదురు వాసానికి కట్టేశాడు. తరవాత వాడు దాన్ని బెత్తంతో బాదుతూ, "పైకెక్కు! ఎక్కవేం?" అని అరవసాగాడు. దెబ్బలకు తట్టుకోలేక, పాపం, ఎద్దు వెదురు వాసాలచుట్టూ అటూ ఇటూ పరిగెత్తసాగింది.

ఆ దారిన వెళ్లేవాళ్లు ఇదంతా చూసి తమలో తాము నవ్వుకున్నారు. త్వరలోనే ఈ సంగతి భూస్వామికి తెలిసింది. ఆయన పరిగెత్తుకుంటూ వచ్చి, "ఆ ఎద్దును కాస్తా చంపేస్తావుట్రా?" అని అడిగాడు.

"మీకు తెలియదు, ఊరుకోండి, సామీ? దీని కింత పొగరా? పైకెక్కి చిగుళ్లు మెయ్యవే అంటే ఎక్కదు! చావగొడితే గాని దానికి బుద్ధిరాదు!" అన్నాడు పాలెకాపు కోపంగా.

"చాల్లే, చాల్లే! నువు దానికి వెదురు చిగుళ్లు మేపవద్దు. ఇంటికి తీసుకుపో!" అన్నాడు భూస్వామి.

ఇది జరిగినప్పటి నుంచీ ఆయనకు పాలెకాపుమీద కచ్చగా ఉంది. వాణ్ణి ఎట్లాగైనా ఏదో సాకు చెప్పి డబ్బివ్వకుండా పంపెయ్యా



లని ఆయన నిశ్చయించుకున్నాడు; ఆ సాకుకోసం తల పగలగొట్టుకో నారంభించాడు.

ఒకనాడాయన తన పాలెకాపుతో, "మన ఇంటిపైన ఉన్న పెంకుటి కప్పు చూశావుట్రా, అది ఎంతో విశాలంగా ఉందిగాని ఎందుకూ పనికి రాకుండా ఉంది. రేపు దానిమీద నువు కూరలమొక్కలు నాటు!" అన్నాడు.

"దానికేం భాగ్యం లేండి!" అన్నాడు పాలెకాపు.

మర్నాడు తెల్లవారుతూనే వాడొక గునపం తీసుకుని ఇంటి కప్పుపై కెక్కి పెంకులన్నిటినీ పగలగొట్టసాగాడు. కొన్ని పెంకుల తునకలు ఇంటో నిద్రపోతున్న భూస్వామి పైన పడ్డాయి. ఆయన బయటికొచ్చి తల ఎత్తి చూసి, "పెంకులన్నీ అలా పగలగొట్టేస్తున్నావు, నీకేం పోయ్యేకాలంరా," అన్నాడు పళ్లుకొరుకుతూ.

"మీకేమీ తెలీదు, ఉండండి! మొక్కలు నాటటానికి కప్పంతా చుప్తాగా తవ్వేస్తున్నానూ!" అన్నాడు పాలెకాపు.

"ఒరే, నీకు పుణ్యం ఉంటుంది! నువు మొక్కలు నాటవద్దులే. ముందు కప్పు దిగిరా!" అన్నాడు భూస్వామి.

ఇటువంటి వాడితో ఏంచెయ్యాలో భూస్వామికి తెలియలేదు.



ఎండాకాలం వచ్చింది. నీరు చాలక భూస్వామి పొలాలలో వేసిన వేసవి పంటలు దెబ్బ తింటున్నాయి.

అలాటి పరిస్థితిలో భూస్వామి తన పాలెకాపుతో, "ఒరే, ఎండదెబ్బకి మన చేలు మాడిపోతున్నాయిగాని, రేపు ఉదయమే మన పొలాలన్నిటిని తెచ్చి భద్రంగా ఇంట్లో పెట్టు!" అన్నాడు.

ఈ దెబ్బతో పాలెకాపు వదిలిపోతాడని భూస్వామి అనుకున్నాడు.

"ఓ, అదెంత భాగ్యం లేండి!" అన్నాడు పాలెకాపు.

మర్నాడు భూస్వామి లేచేసరికి ఆయనకు ఎవరో పెద్ద చప్పుడు చేస్తూండటం వినిపించింది. ఆయన బయటికి వచ్చాడు.

పాలెకాపు పెద్దపలుగు తీసుకుని ఇంటి ముందుగోడను పడగొట్టేస్తున్నాడు. అప్పటికే ద్వారబంధాన్ని తీసి పారేశాడు. గోడ కొంచెం కొంచెమే పడిపోతున్నది.

"ఏంచేస్తున్నావురా, పశువా? నీకేమైనా మతి పోయిందా! ఆగు!" అన్నాడు భూస్వామి.

"మీకేమీ తెలీదు, ఊరుకోండి!" అంటూ పాలెకాపు గోడను సాంతం పడగొట్టటంలో నిమగ్నుడయాడు.

"ఆ పని మానావా, మానవా?" అని భూస్వామి గద్దించాడు.

"మరి పొలాలను ఇంటికి తెమ్మంటిరిగా?" అన్నాడు పాలెకాపు.

"ఇల్లంతా పడగొట్టమన్నానా?" అన్నాడు భూస్వామి.

"ఈ ముందు గోడన్నా అడ్డం తియ్యక పోతే అంత పెద్దపొలాలు ఇంటో చేరటం ఎట్లా?" అన్నాడు పాలెకాపు.

ఈ దెబ్బతో భూస్వామికి బుద్ధి వచ్చింది. ఈ పాలెకాపు ముందు తన ఎత్తులు పార వనుకున్నాడు. తరవాత ఆయన పాలెకాపుకు బోలెడంత డబ్బిచ్చి వదిలించుకున్నాడు.



# ఎవరిసొత్తు వారిది!





# అసమీక్ష్యకారిత్వము

చక్రధారి :

అల శతబుద్ధి, స-హస్రబుద్ధి యని
కలవు చేపలు రెండు, - కొలనున నొకట.
ఏకబుద్ధి యనంగ - నింకొక కప్ప
ప్రాకట స్నేహమ్ము - భావించి నడచు.
ఒకపరి బెస్త లె-టో పోవుచుండి
చకచక లాడు మ-త్స్యమ్ముల జూచి
రేపిక్కడికి వచ్చి - చేపలు పట్టి
మాపున కేగుద - మనుకొనినారు.
ఇది విని ఆ చేప - లెల్ల చింతింప
గదుముచు శతబుద్ధి - కలత వద్దనెను.

* * *

సహస్రబుద్ధి :

పలువల కూతల - కలత చెందకుడు
ఖలుల కోర్కెలవెల్ల - గట్టున పడునె.

శతబుద్ధి :

తెలివితో ఆపద - తొలగింపవచ్చు
కలత చెందగరాదు - కానున్నదంచు.

ఏకబుద్ధి :

అంతగా తెల్వి నా - కమరలే, దగుట
ఇంతలో నెటకైన - ఏగెద నిపుడె

* * *

తెలివైన వారి ప-ల్కుల చేపలెల్ల
తలచి, కప్పను జూచి - కిలకిల మనెను.
తన కుటుంబమ్ముతో-డను కప్ప మటుకు
వనరైన ఇంకొక్క - బావికి నేగె.
ప్రొద్దుట బెస్త లు-ప్పొంగుచు వచ్చి
పద్దుగా చేపల - పట్టుకున్నారు.
అటుఇటు నడయాడి, - ఆవలి కరుగ
దిట వొనరించి, ఏ-దిక్కును లేక
చిక్కెను చివరకు - చేప లవెల్ల
కొక్కెమ్మునకు వేసె - ఒక్కొక బెస్త.
కప్ప వానిని జూచి - కాంతతో ననియె
గొప్ప తెల్విగలారు - కూలిరటంచు.

విద్వాన్ విశ్వం

సువర్ణసిద్ధి :

కావచ్చు గాని, నే - కాదన్న కొలది
ఈ విధి వచ్చి నా, - విట్లయినావు.
కలదొక్క కథ నీకు - తెలియ జెప్పెదను.
పలు గుడ్డలను మోయు - నల గాడి దొకటి.
రేల చేలకు వోయి - చాలగా మేయు
అ లీల నక్క స్నే-హమ్మయె తనకు
ఆ రెండు నొక రేయి - చేరె నోతోట
మోరెత్తి గాడిద - ముదముతో ననెను :
"చల్లని రేయి ఎం-చక్కని గాలి
ఉల్లమారగ పాడ - నుత్సాహ మొదవె."
వలదనె నక్క "నీ - పాడు గొంతునకు
కలవారు వచ్చి చి-క్కుల బెట్టగలరు?"
అని ఎంత చెప్పిన - నాగక ఖరము
వినిపించె తన గొంతు - విప్పి గీతమ్ము
సరగున కాపరుల్ - చావగ తన్ని
బరువైన బండను - ఖర కంఠమునకు
కట్టిపోయిరి, నక్క - కడ దాగియుండె.
అట్టె నొప్పులు తీరి-నంత గాడిదయు
పరువెత్తసాగె అ-ప్పుట నక్క అనెను :
"బరువైన బండ నీ - పాండిత్యమునకు
సరియైన బహుమతి, - సావాసి మాట
గురిలేక వినవైతి - కూలిపోయితివి."

*    *    *



చెప్పిన వినమి ఈ-స్థితి నీకు గల్గె

చక్రధారి :

తప్పు చేసితి నౌను - తలపున దగిలె.
ఒక ఊర సాలెవా - డుండెను పేద
ఒకపరి దబ్బులొ-కొక్కటే విఱుగ,
వనికేగి ఒక చెట్టు - పడగొట్ట జూచె
అనె యక్షు డాచెట్టు-నం దుండువాడు.
"కోరిన విత్తులే - కొట్టకు చెట్టు
ఈ రీతి దీనిపై - నేనుండ నిమ్ము"
ఏమి కోరగ వాని - కెటు తోచలేదు
ఆమీద తన భార్య - నడుగగా వచ్చె.
దారిలో మంగలి - తన మిత్రుడనియె :



" కోరుము రాజ్యము - తీరు నీ పీడ
ఆడువారిని సల-హా అడుగకుము
కీడు గల్గును దాన - లేదు రాజ్యమ్ము"
అ మాట వినక వా - డంతట భార్య
గోముగా నడుగ అ-కోమలి అనెను :
" వద్దు రాజ్యాలు సం-పద లేల మనకు
ముద్దుగా మరి రెండు - బొద్దు చేతులను
మరి ఒక్క తల గోరు - మన కవి చాలు ;
కరముల రెంట మ-గ్గా ల్నేయవచ్చు,
దానితో మనకెంతో - ద్రవ్యమ్ము వచ్చు
కాని "మ్మటన్న చ-క్కగ వెళ్లె వాడు.
కోరి యక్షుని అవి - గొనివచ్చుచుండ
దారిని జనులెల్ల - దనుజు డటంచు
చావమోదిరి, మిత్రు - సలహాను వినక
ఆ విధి వాడీగ్లె... - అన్న విన్నావె ?

చక్రధారి :

అవును నరుం డీల్గు - అత్యాశవలన
అవుగాములని లేని-యవి ఊహసేయు.
మునుపొక్క పిసినిగొ-ట్టను విప్రుడుండె
తన చెంబుతో బ్రతు-కును నీడ్చికొంచు.
కన్న అవస్థల - గడచి ఓ చెంబు
ఇన్ని పేలాలతో - నెటొ నింపి దాచె.
ఆ చెంబు నెవ్వరే - నాశింతురనుచు
కాచుక రేయెల్ల - కల గనుచుండె.
కఱవు వచ్చిన చాలు - కడవెడు డబ్బు
దొరకు నీ పేలాల - సరి సరి కమ్మ.
ఆ విత్తమున మేక - నప్పుడు కొందు
కావలసిన మంద - కనుచుండు నద్ది.
అవి అమ్మి ఆలగొం, - దవియును నమ్మి
మిపుల గుఱ్ఱా ల్గొందు - మిద్దె కట్టెదను.
అంత నొకమ్మి పెం-డ్లాడి పిల్లలను
వంతుల గని పెంచి - వఱలుచు నుందు.
పిల్లవాడటు పడ - పెద్ద కోపమున
జల్లన పెండ్లాము - జాడించి తందు
అని కాలు జాడింప - నాచెంబు పగిలె,
తన గింజలెల్ల మ-ట్టిని గలసినవి.



# వినోదమైన కల

ఒకప్పుడు ఏథెన్స్ నగరంలో ఒక ధనికుడికి హెర్మియా అని ఒక కుమార్తె వుండేది. ఆమెకు హెలెనా అని ఒక స్నేహితురాలుండేది. హెర్మియాకు యుక్తవయసు రాగానే ఆమె తండ్రి ఆమెకొక వరుణ్ణి నిశ్చయించాడు. అతని పేరు డిమిట్రియస్. అయితే హెర్మియా డిమిట్రియస్‌ను ప్రేమించలేదు, లీసాండర్ అనే మరొక యువకుణ్ణి ప్రేమించింది.

హెర్మియాను పెళ్ళాడగోరిన డిమిట్రియస్ ఒకప్పుడు హెలెనాను ప్రేమించినవాడే. అయితే హెర్మియాను చూసిన క్షణం నుంచీ అతని మనసు మారిపోయింది. దానికి తగ్గట్టుగానే హెర్మియా తండ్రికి డిమిట్రియస్‌పైన అభిమానంకూడా ఏర్పడింది.

అయితే హెర్మియా తన తండ్రితో, "నేను డిమిట్రియస్‌ను పెళ్ళాడను, లీసాండర్‌నే పెళ్లాడతాను!" అని ఖచ్చితంగా చెప్పింది.

ఆ కాలంలో ఏథెన్స్ నగరంలో ఒక శాసనం అమలులో వుండేది. అదేమిటంటే, కూతుళ్లు తండ్రి నిర్ణయించిన వరుణ్ణి పెళ్లాడితీరాలి; పెళ్లివిషయంలో తండ్రిని ధిక్కరించిన కూతురుకు మరణదండన విధించబడుతుంది; లేదా ఆమె యావజ్జీవం అవివాహితగా వుండిపోయి యోగినిగా జీవించాలి.

హెర్మియా తండ్రి రాజుగారివద్దకు వెళ్ళి తన కూతురిపై ఫిర్యాదు చేశాడు. "నీ తండ్రి కోరిక పాటించి డిమిట్రియస్‌నే పెళ్ళాడరాదా?" అని రాజుగారుకూడా సలహా ఇచ్చాడు. కాని హెర్మియా ఇందుకు ఒప్పుకోలేదు.

"అమ్మాయీ, నీ మనసు మార్చుకోవటానికి నాలుగురోజులు వ్యవధి ఇస్తున్నాను. అప్పటికీ నీబుద్ధి మారని పక్షంలో చట్టం ప్రకారం నిన్ను నేను శిక్షించక తప్పదు,'



అని హెచ్చరించి రాజు వారిని పంపేశాడు. హెర్మియా ఏమిచెయ్యటానికి తోచకవున్న స్థితిలో ఆమె ప్రియుడైన లీసాండర్ ఒక సలహా చెప్పాడు. "ఈ నగరానికి ఏడు కోసుల దూరాన మా పెత్తల్లి వుంటున్నది. ఆమె చాలా ధనవంతురాలు. నన్ను తన కొడుకులాగే చూసుకుంటుంది. మనం అక్కడికి రహస్యంగా చేరుకున్నామంటే మన వివాహాన్ని అడ్డగించేవారుండరు. అందుచేత రేపు రాత్రి యెవరికీ తెలియకుండా బయలుదేరి నగరానికి ఒక కోసుదూరంలో వున్న వనానికి వచ్చావంటే నేను నీకోసం వేచివుంటాను," అన్నాడతను.



హెర్మియా స్నేహితురాలైన హెలెనా ఇంకా డిమిట్రియస్‌ను పాపం, ప్రేమిస్తూనే వున్నది. ఆ డిమిట్రియస్ తనను పెళ్ళాడక తన స్నేహితురాలిని పెళ్ళాడబోతున్నాడన్న సంగతి ఆమెకుకూడా బాధగానే వున్నది. హెలెనా విచారం పోగొట్టటానికిగాను హెర్మియా తమ రహస్యాన్ని కాస్తా బయట పెట్టేసింది. "ఇవాళ రాత్రి నేను లీసాండర్ వెంట ఈ నగరం విడిచి వెళ్ళిపోతున్నాను. నేను వెళ్ళిపోయాక డిమిట్రియస్ నిన్ను మళ్ళీ ప్రేమిస్తాడు, దిగులుపడకు!" అని ఆమె తన స్నేహితురాలితో అన్నది.

హెలెనా ఈ రహస్యాన్ని కాస్తా తీసుకుపోయి డిమిట్రియస్‌తో చెప్పేసింది. అలాటి పని చెయ్యటంవల్ల హెర్మియా ప్రయత్నం భగ్నమయే అవకాశం వుందని హెలెనా ఎరుగును; కాని ఆ రహస్యాన్ని చెప్పటం వల్ల డిమిట్రియస్ మనసు తనవేపు మళ్ళుతుందని ఆ అమాయకురాలు అనుకున్నది.

హెర్మియా, లీసాండర్ కలుసుకుందామనుకున్న వనం ఒక భూతాల రాజ్యం. దానికొక రాజూ, రాణీ వుండేవారు. వారిద్దరి మధ్యా కొంతకాలంగా కొంత ఘర్షణ నడుస్తున్నది. ఏమంటే భూతాల రాణి ఒక పిల్లవాణ్ణి పెంచుతున్నది. ఆ పిల్లవాణ్ణి



తనకు సేవకుడుగా ఇవ్వమని భూతాల రాజు కోరాడు. రాణి నిరాకరించింది.

ఎలాగైనా తన భార్యకు గర్వభంగం చెయ్యాలనే వుద్దేశంతో భూతాలరాజు తన భటుడైన పక్ అనేవాణ్ణి పిలిచి, "ఒరే, ఫలానిచోట ఒక ఊదారంగు పువ్వున్నది. దానిని పట్టుకురా. రాణి నిద్రపోయేటప్పుడు ఆ పువ్వురసం ఆమె రెప్పలకు రాచినట్లయితే, నిద్రలేస్తూనే ఆమె మొదటగా ఏజంతువును చూసినా సరే ఆ జంతువును మోహించేస్తుంది. మనం ఆమెను అవమానపరిచి ఆమె పెంచే కుర్రవాణ్ణి సంపాదించుదాం. ఆ తరవాత ఆ పువ్వు రసానికి విరుగుడు నేను చేసెయ్యగలను!" అన్నాడు.

పువ్వును తీసుకురావటానికి పక్ బయలుదేరి వెళ్లాడు. ఈలోపల భూతాలరాజు ఉన్న ప్రదేశానికి దగ్గరగా డిమిట్రియస్, హెలెనా వచ్చారు.

హెర్మియా ఈ వనంలో ఈరాత్రి లీసాండర్‌ను కలుసుకుని, అతనివెంట వెళ్లి పోతున్నదని తెలియగానే డిమిట్రియస్ ఆమెను వారించి, వారి పలాయనం భగ్నం చెయ్యటానికి బయలుదేరివచ్చాడు. హెలెనా అతని వెంటపడి వచ్చింది. వనమంతా ఎంతసేపు తిరిగినా హెర్మియా, లీసాండర్ల



జాడ కనిపించలేదు. ఆ కారణంచేత అసలే చిరాకులో ఉన్న డిమిట్రియస్, తనను వెంబడిస్తున్న హెలెనాను చూసి మరింత చిరాకుపడ్డాడు. "నువు నాకు శనిలాగా ఎక్కడ దాపరించావు? వెళ్లిపో! నీ మొహం చూస్తేనే నాకు అసహ్యం!" అన్నాడతను.

"నేను నిన్ను ప్రేమించకుండా ఉండలేను. తన యజమానిని వెంబడించే పెంపుడుకుక్కపాటి అయినా చేయనా?" అని హెలెనా ప్రాధేయపడింది.

"నువు నన్నిలా వెంబడిస్తే నీ ప్రాణం తీసెయ్యగలను, జాగ్రత్త!" అంటూ డిమిట్రియస్ పరిగెత్తసాగాడు.



"చావటానికైనా నేను సిద్ధమే!" అంటూ హెలెనా అతన్ని వెంబడించింది.

వీరిద్దరి సంభాషణా భూతాలరాజు అదృశ్యంగా ఉండి ఆలకించి, "ఆడకూతురు అలా బతిమిలాడుతుంటే దులుపుకుని పారిపోయే ఈ యువకుడికి తగిన శాస్తి చెయ్యాలిసిందే!" అనుకున్నాడు.

ఇంతలో పక్ పువ్వుతో సహా అక్కడికి తిరిగివచ్చాడు.

భూతాలరాజు వాడితో, "ఒరే, ఈ పువ్వు రసం మీ రాణిగారి కళ్లకు పూయాలి. ఆమె ఫలానిచోట పొదరింట పడుకుని నిద్రపోతుంది. ఇంకొక విషయం, ఈ వనంలో



ఒక కుర్రవాడూ, కుర్రదీ తిరుగుతున్నారు. వాళ్లు ఏథెన్స్‌నగరవాసులు. వారి దుస్తులు చూస్తేనే తెలుస్తుంది. వాళ్లు ఎక్కడ పడుకుంటారో వెతికి తెలుసుకుని, కుర్రాడి కళ్లకు ఈ రసం కాస్త రాస్తివా, వాడు లేస్తూనే ఆ పిల్లను చూసి ఆమె వెంట కుక్కలాగా తిరుగుతాడు. నువు వెళ్లి తొలికోడి కూసే సమయానికి మళ్లీ నాకు కనపడు, వినోదం చూతాం!" అన్నాడు.

పక్ ముందు భూతాలరాణి పడుకున్న చోటికి వెళ్లి ఆమె రెప్పలకు పువ్వురసం రాచి, తరవాత ఏథెన్స్‌నగరవాసులను వెతకనారంభించాడు.

దురదృష్టవశాత్తూ వాడికి హెర్మియా, లీసాండర్‌లు వనంలో ఒకచోట కనిపించారు.

వారిద్దరూ అనుకున్నప్రకారం వనంలో కలుసుకుని చాలాసేపు నడిచారు. కాని దారి తప్పిపోవటంవల్ల చివరకు వాళ్లు అలిసిపోయి ఆ రాత్రి వనంలోనే పడుకుందామనుకున్నారు. హెర్మియా పడుకున్నచోటికి కొద్దిదూరంలో లీసాండర్ పడుకున్నాడు. ఇద్దరూ నిద్రపోయారు. ఆ సమయంలో పక్ అక్కడికి వచ్చాడు, తమరాజు చెప్పినది ఈ జంటనుగురించే అనుకున్నాడు. అతడు



లీసాండర్ కళ్లకు పువ్వురసం రాచి తన దారిన తాను వెళ్లిపోయాడు.

ఈలోపల హెలెనా డిమిట్రియస్‌తో సమంగా పరిగెత్తలేక వెనకపడి, అతని కోసం కాలుకాలిన పిల్లిలాగా వనమంతా వెతకసాగింది. తిరుగుతూ, తిరుగుతూ లీసాండర్ పడుకుని ఉన్నచోటికి వచ్చి, అతన్ని గుర్తించి, అతను నిద్రపోతున్నాడో లేక డిమిట్రియస్ చేతిలో చనిపోయాడో తెలుసుకునే ఉద్దేశంతో తట్టి లేపింది. లీసాండర్ కళ్లు తెరుస్తూనే హెలెనాను చూసి, పువ్వురసం ప్రభావంచేత ఆమెను ప్రేమించ నారంభించాడు.

హెలెనా ఇది చూసి కంగారుపడింది. తనను లీసాండర్ వెటకారం చేస్తున్నా డనుకుని, తనను చూసి తానే అసహ్యపడుతూ అక్కడినుంచి బయలుదేరింది. లీసాండర్ ఆమెను వెర్రివాడులాగా వెంబడించాడు.

ఈలోపుగా భూతాలరాజుకు పక్ చేసిన పొరపాటు తెలిసిపోయింది. ఆయన వనంలో తిరుగుతూ డిమిట్రియస్ పడుకుని నిద్ర పోతున్నచోటికి వచ్చాడు. హెలెనాను వదిలించుకున్నాక డిమిట్రియస్ హెర్మియా కోసం చాలాసేపు తిరిగి, అలిసి ఒక చోట నిద్రపోయాడు.



ఇది అవకాశం చేసుకుని భూతాలరాజు డిమిట్రియస్ కళ్లకుకూడా పువ్వురసం రాచాడు. అతను కళ్ళు తెరిచి చూసేసరికి హెలెనా అటుగా వచ్చింది. ఆమెవెంట లీసాండర్‌కూడా వున్నాడు.

రసప్రభావంవల్ల డిమిట్రియస్‌కూడా హెలెనాను ప్రేమించసాగాడు. హెలెనా తన కళ్లనూ, చెవులనూ నమ్మలేకపోయింది. అదివరకు హెర్మియాను ప్రేమించినవా రిద్దరూ ఇప్పుడు తనను ప్రేమించుతూ వుండటంచూసి ఇదంతా నటనే అనుకున్నది.

హెర్మియాకూడా తన ప్రియుడైన లీసాండర్‌ను వెతుక్కుంటూ అక్కడికి వచ్చింది.

లీసాండర్ హెలెనా వెంటపడటం ఆమెకు కొంచెంకూడా అర్థంకాలేదు.

స్నేహితురాళ్లిద్దరూ ఒకరినొకరు అనుమా నించుకుని తగాదా పడసాగారు. మగవా ళ్ళిద్దరూ హెలెనా కోసం ఒకరితో ఒకరు పోటీపడి యుద్ధానికి తలపడ్డారు. పక్ తన మాయాప్రభావంచేత వారు ఒకరికొకరు కనపడకుండా, అందకుండా చేశాడు.

చివరకు అందరికీ అలసట వచ్చింది. ఇద్దరు యువకులూ, ఇద్దరు యువతులూ కూడా పడుకుని నిద్రపోయారు. ఆ సమ యంలో పక్ వచ్చి లీసాండర్ కళ్ళకు పూసిన రసానికి విరుగుడుగా మరొక పసరు రాచాడు. దాని ప్రభావంవల్ల లీసాండర్‌కు హెర్మియాపైన వుండిన పాతప్రేమ తిరిగి వచ్చింది. డిమిట్రియస్ పువ్వురసం ప్రభా వంచేత హెలెనాను ప్రేమించసాగాడు. ఈవిధంగా ఆ రెండు జంటల వివాహ సమస్యా పరిష్కారమైపోయింది.

అక్కడ వనంలో భూతాలరాజు కోరిక కూడా నెరవేరింది. భూతాలరాణి ఆ రాత్రి నిద్రమేలుకుని పొదరింటి బయటికి వస్తూనే ఒక గాడిద తల గల మనిషిని చూసి పువ్వు రసంప్రభావంచేత ప్రేమించింది. ఆ మనిషి ఆ వనంలో ఆ రాత్రి చిక్కుకుపోయిన ఒక సాలెవాడు; పక్ వాడికి ఒక గాడిదతల తగిలించాడు.

తెల్లవారుతూనే భూతాలరాజు తన భార్య ఉన్నచోటికి వచ్చి ఆ గాడిద తల గల మని షిని చూసి అవహేళన చేశాడు. భూతాల రాణి సిగ్గుపడి, తన భర్తతో రాజీపడటానికి గాను తాను పెంచుకునే కుర్రవాణ్ణి ఆయ నకు సేవకుడుగా ఇచ్చేసింది.

ఇలాటి సంఘటనలు ఎక్కడైనా జరుగు తాయా అని మీకు సందేహం కలగవచ్చు. ఇదంతా నిజంగా జరిగినది కాదనిపించే పక్షాన, ఒక వినోదమైన కల అనుకుని సంతోషించండి.





# నూలు వడకలేని భార్య

ఒక నగరంలో ఒక సంపన్నుల ఇంట ఒక అందమైన అమ్మాయి ఉండేది. అదృష్ట వశాత్తూ ఆమెకు మంచి సంబంధమే కుదిరింది. వరుడు పొరుగు సీమవాడై నప్పటికీ ధనికుడు, అందగాడు. పిల్లకు యువకుడూ, యువకుడికి పిల్లా నచ్చారు. అందుచేత వారిద్దరికీ సలక్షణంగా పెళ్లిచేసి తల్లి దండ్రులు పిల్లను భర్తవెంట అత్త వారింటికి పంపారు.

కొద్దినెలలు భార్యా భర్తలు సుఖంగా కాపరం చేసినాక భర్త ఒకనాడు ఒక రాట్నమూ, బుట్టెడు ఏకులూ తెచ్చి భార్య ముందు పెట్టి, "రోజూ నూలు వడుకు! దారం సన్నగా ఉండాలి, పురి సమంగా ఉండాలి," అన్నాడు.

భార్య తెల్లమొహం వేసి, "ఏమిటిది? నేను రోజూ రాట్నంమీద నూలు వడకాలా?" అన్నది.

"అవును. నాకు ఏటా కావలిసిన రెండు జతల ధోవతులూ, కండువాలూ నువు వడికిన నూలుతోనే నేయించుకుంటాను," అన్నాడు భర్త.

"నాకు నూలు వడకటం చాతకాదు!" అన్నది భార్య.

పనిమంతురాలైన ఆడదానికి నూలు వడకటం రాదంటే భర్త నమ్మలేదు; సోమరి తనంకొద్దీ తన భార్య ఆ విధంగా బొంకు తున్న దనుకున్నాడు.

"చాల్లే, పిచ్చిమాటలు చెప్పక, రోజుకు ఆరు విచ్చల నూలు తీసి మరీ నాకు చూపించాలి, తెలిసిందా!" అంటూ భర్త బయటికి వెళ్లిపోయాడు.

పుట్టెడు దిగులుతో భార్య రాట్నం ముందు కూచుని నూలు తీయ యత్నించింది. కాని ఆమెకు అభ్యాసం లేకపోవటం చేత ఆ నూలు ఒకచోట మందంగా, ఒక

టి. శ్యామసుందరరావు



చోట సన్నగా పురి లేకుండా, మరొకచోట ఉండలు ఉండలుగా వచ్చింది.

ఆరోజు సాయంత్రం భర్త పొలాన్నుంచి ఇంటికి వచ్చేసరికి ఆమె ఒక విచ్చ కూడా తీయలేదు.

భర్త ఆ దారం చూస్తూనే, భార్యమీద మండిపడ్డాడు.

"వేళాకోళమా? ఇలా చేశావంటే నిన్ను వదిలేసి బుద్ధిగా నూలు వడికేదాన్ని చేసుకుంటాను, ఏమనుకున్నావో! రేపు ఉదయమే నేను పనిమీద పట్నం పోతున్నాను. మళ్లీ పది రోజుల్లో వస్తాను. ఈలోపుగా బుట్టెడు ఏకులూ దారంతీసి ఉంచాలి. అలా చెయ్యకపోయావో నేను అన్నంత పనీ చేస్తాను!" అన్నాడు భర్త భార్యతో.

భార్యకు పుట్టెడు దిగులు పట్టుకున్నది. తన పుట్టింట రాట్నమే లేదు. అందుచేత ఆమె ఎన్నడూ దారంతీసిన పాపానపోలేదు. తన భర్త ఉండే సీమలో ప్రతి ఆడదీ దారం తీస్తుంది. అందుచేత ఇక్కడివారు దారం తీయలేని స్త్రీలను గౌరవించరు. తన భర్త వెళ్లిపోయినాక భార్య విచారంతో వెళ్లి తమ ఇంటిపక్కన ఉండే మైదానంలో ఒక పెద్ద బండరాతిపైన కూచున్నది.

కొంతసేపటికి ఆమెకు ఎక్కడినుంచో మాటల సవ్వడీ, నవ్వులూ వినిపించాయి. చూట్టూ చూస్తే ఎక్కడా జనం పొడ లేదు. శ్రద్ధగా ఆలకించగా ఆ మాటలూ, నవ్వులూ తాను కూచున్న రాతికిందినుంచి వస్తున్నట్టు తోచింది.

భార్య రాతిపైనుంచి లేచి అతి కష్టంమీద ఆ రాతిని పక్కకు తోసింది. దాని కింద తాను పట్టేపాటి బిలం కనిపించింది. ఆమె ఆ బిలంలోకి వెళ్లింది. లోపల విశాలమైన గదిలాటిది ఉన్నది. ఆ గదిలో ఆరుగురు మరుగుజ్జులైన స్త్రీలున్నారు. వారు చూడటానికి అయిదారేళ్ల ఆడపిల్లలంతే ఉన్నారు. అందరి ముందూ బొమ్మరాట్నా

లున్నాయి. ఆ స్త్రీలు వాటిని వాయువేగంతో తిప్పుతూ, క్షణానికొక ఏకుచొప్పున తీసుకుని సాలెగూడు దారంలాటి దారాన్ని తీసి, ఒక పక్కగా పోగు వేస్తున్నారు. వాళ్లను చూస్తూనే భార్య ఆశ్చర్యపోయింది.

ఆ ఆరుగురి మూతులూ ఒక పక్కకు తోసుకుపోయి ఉండటం భార్య గమనించింది. వారు అంత వేగంతో దారం తీస్తూ కూడా తమలో తాము మాట్లాడుకుంటున్నారు, వంకర మూతులతో పెద్దగా నవ్వుతున్నారు.

భార్య వారిని పలకరించి, "అమ్మా, మీరెవరో నేనెరగను, కాని మీరు దారం తీసే పద్ధతి చూస్తే నాకు ఆశ్చర్యంగా ఉంది. మీకున్న శక్తిలో నాకు నూరోవంతు ఉన్నా నాకీ విచారం లేకపోను!" అంటూ, భర్త పట్నంవెళ్లేముందు అన్నమాటలు తలుచుకుని బావురుమన్నది.

ఆ ఆరుగురు స్త్రీలూ రాట్నాలు తిప్పటం మానేసి, "ఏమిటమ్మా నీకు వచ్చిన కష్టం?" అని అడిగారు.

ఆమె వారితో తన భర్త పెట్టిన నియమం గురించి చెప్పి, "మావారు ఇంటికి వచ్చేసరికి ఈ బుట్టెడు ఏకులూ నూలుతీసి ఉంటేనేగాని నా పరువు దక్కదు. తరవాత సంగతి దేవుడెరుగు!" అన్నది.





ఆ స్త్రీలు నవ్వి, "ఈ మాత్రానికి విచారం దేనికమ్మా? మేము ఏకులు వడికిపెడతాంలే. నీ భర్త వచ్చే రోజు ఉదయం మమ్మల్ని కేక వేశావంటే మేము వచ్చి కొద్ది నిమిషాలలో నీ పని పూర్తి చేస్తాం. మాకుమాత్రం ఒక పూట మీ యింట ఇంత భోజనం పెట్టు, చాలు!" అన్నారు.

భార్య అలాగే చేసింది. భర్త వచ్చేరోజు ఆ స్త్రీలు వచ్చి అతి సన్నని దారం తీసి ఇంత ఎత్తున పోగువేశారు.

భర్త వచ్చాడు. మూతి వంకర స్త్రీలను చూసి భార్యతో, "వీరెవరు?" అన్నాడు.

"మన పొరుగువాళ్ళే. నాకు తోడుగా వచ్చారు. భోజనం చేసి మరీ వెళ్ళమన్నాను!" అన్నది భార్య.

తరవాత కాస్సేపటికి అందరూ భోజనాలకు కూచున్నారు. ఆ స్త్రీలు మాట్లాడినా, నవ్వినా మూతి ఒక పక్కకు తోసుకుపోతూండటం గమనించి భర్త, "ఏమమ్మా, మీ అందరి మూతులూ అలా ఒక పక్కకు తోసుకుపోయాయి. అది మీ పుటక తీరా లేక అందుకు వేరే కారణం ఏదైనా ఉన్నదా!" అని అడిగాడు.

"ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకోబోయేదాకా నూలు వడికీ, వడికీ, వడికీ మా మూతులు వంకరపోయాయి, నాయనా! అంతకన్న వేరే కారణం ఏమీ లేదు!" అన్నారు ఆ స్త్రీలు.

వారు వెళ్ళిపోయాక భర్త భార్యమొహాన్ని పరీక్షగా చూశాడు. ఆమెది అందమైన మొహం, అందులోనూ మూతి చక్కగా తీర్చి దిద్దినట్టున్నది.

"ఏమే, ఇదివరకు ఏం వడికావో వడికావు, ఇకముందు నువు రాట్నం ముందు కూచోవటానికి వీల్లేదు! అంతే!" అంటూ భర్త రాట్నాన్ని అటక మీదికి ఎక్కించేశాడు.

భార్య బతుకుజీవుడా అనుకుని ఒక్క నిట్టూర్పు విడిచింది.





# దక్షిణ ధ్రువ ప్రాంతపు వింతలు



## 3

దక్షిణ ధృవప్రాంతం అనేక విధాల మరొక ప్రపంచ మనిపించుకుంటుంది. అక్కడి వాతావరణమూ, ప్రకృతీ, జీవరాసులూ— అంతా వేరే. ఈ ప్రాంతాన్ని గురించి పరిశోధనలు జరగాలంటే కేవలం ఈ ప్రాంతపు నైసర్గిక స్వరూపాన్ని పరిశీలించటం చాలదు. అందుచేత బర్డ్ వెంట అనేక రకాల శాస్త్ర వేత్తలు, పదార్థ వైజ్ఞానికులూ, రసాయన వేత్తలూ, వాతావరణ నిపుణులూ పలురకాల పరిశోధనలు సాగించారు.

భూమిని ఆశ్రయించి ఉన్న అయస్కాంత శక్తిని కొలిచే ఒక కొత్తరకం యంత్రం సహాయంతో వీరు దక్షిణ ధృవప్రాంతాన్ని కప్పిఉన్న మంచుకింద భూమిలో ఉన్న ఖనిజాలను గురించి అనేక వివరాలు సంపాదించారు. ఎగిరే విమానాల నుంచి నూరు అడుగుల తీగెకు ఈ యంత్రాన్ని వేళ్లాడగట్టుతారు. విమానం ఎగిరేటప్పుడు కింద ఉండే భూమిపై గల అయస్కాంత శక్తిలో కలిగే ప్రతి చిన్న మార్పునూ యంత్రం సూచిస్తుంది.

దీని సహాయంతో వీరు దక్షిణ అయస్కాంత ధృవం వెయ్యి చదరపుమైళ్ల మేర, కోడిగుడ్డు ఆకారంలో విస్తరించి ఉన్నదని కనిపెట్టారు. ఈ మేరలో అనేక స్థలాల అయస్కాంతపు ముల్లు నిటారుగా లేచి నిలబడుతుంది.

ఈ ప్రాంతంలో వీరు గమనించిన ఒక విపరీత పరిస్థితి ఏమిటంటే "కాంతి కలిగించే అంధత్వం." మన కళ్లు చీకట్లో చూడలేవు, తీవ్రమైన కాంతినీ చూడలేవు. కాని కళ్లు చూడలేని మూడో పరిస్థితికూడా ఉన్నది. అదేమిటంటే "నీడలు లేని" కాంతి.



ఈ ధృవప్రాంతంలో ఒక్కొక్కసారి ఏమవుతుందంటే, ఆకాశాన్నంతటినీ చిన్న చిన్న దూదిపింజెలలాటి మబ్బులు ఆవరించేస్తాయి. కింద మంచునుంచి ప్రతిఫలించే కాంతి ఈ మబ్బులను చేరుకుని తిరిగి భూమికేసి వస్తుంది. ఈవిధంగా భూమ్యాకాశాల మధ్య ప్రాంతమంతా కాంతితో నిండిపోతుంది. ఈ కాంతిలో నీడలన్నవి లేకుండా పోతాయి. ఎత్తు పల్లాలు తెలియవు. అంత దూరంలో ఉన్న మనుషులు కనిపించినట్టే కనిపించి అంతలోనే అదృశ్యులైపోతారు. విమానాలలో ఎగిరే వారికి భూమి ఏదో ఆకాశమేదో, తెలియదు, ఎదురుగా వచ్చే కొండలుసయితం కనిపించవు.

ఇది విమానాలకు చాలా ప్రమాదకరం. ఇలాటి కాంతిసముద్రంలో ఒక విమానం దెబ్బతిన్నది. ముగ్గురు చనిపోయారుకూడా!

ఇంకొక వింతవిషయం—

భూమధ్యరేఖవద్ద 60 వేల అడుగుల ఎత్తున గాలిలో మరొక పొర ఆరంభమవుతుంది. (దాన్ని స్ట్రాటోస్ఫియర్ అంటారు.) భూమిపైనుంచి గాలిలోకి వెళ్లినకొద్దీ వేడి తగ్గుతూ పోతుంది. 60 వేల అడుగుల ఎత్తునుంచీ వేడి తగ్గటం నిలిచిపోతుంది, లేదా వేడి కొద్దిగా హెచ్చుతుంది.

కాని దక్షిణ ధృవప్రాంతంలో పరిస్థితి వేరు. ఇక్కడ గాలిపొరలో మార్పు రెండు వేల అడుగుల ఎత్తునే ప్రారంభమవుతుంది. 2 వేల అడుగుల ఎత్తునుంచి 2,300 అడుగుల ఎత్తు మధ్యగల గాలిపొర చాలా వేడిగా—భూమిమీదకన్న 8 లేక 10 డిగ్రీలు వెచ్చగా—ఉంటుంది.

ఇక్కడి గాడ్పులను గమనించటానికి పెద్ద పెద్ద బెలూనులను గాలిలోకి పంపి వాటి గమనాన్నీ, వేగాన్నీ పరిశీలించారు. ఆకాశాన చిన్న చిన్న మబ్బులు కమ్మి ఉన్నప్పుడు బెలూనులకు పెద్ద వస్తువులు

కట్టి, వాటిని రాడారు యంత్రాలతో గమనించారు.

ఆకాశాన మబ్బులు లేని సమయంలో ఇక్కడ (వేసవిలో) ఆకాశం నీలంగా ఉండక ఊదారంగుగా ఉంటుంది. గాలిలో ధూళి కణాలు లేకపోవటమే దీనికి కారణం అయి ఉండవచ్చు.

ఇక్కడి మంచు ఒక్కొక్కప్పుడు పొగ మంచు రూపంలో గాలిని అవహిస్తుంది. ఈ పొగమంచులో ఉండేవి అతి సూక్ష్మమైన మంచుకణాలు. అందుచేత ఈ పొగ మంచులోనుంచి సూర్యుణ్ణి చూసినట్టయితే సూర్యబింబం చుట్టూ అందంగా ఇంద్ర ధనుస్సు కనిపిస్తుంది.

బర్డ్ మొదలైనవారు వేసుకున్న శిబిరాలకు కొద్ది మైళ్ల దూరాన మంచులో సొరంగాలు నిర్మించుకుని "సీల్" అనే జాతిజంతువులు అనేకం నివసిస్తూ కనిపించాయి. ఈ సొరంగాలలోకి నీలపుకాంతి వస్తూ ఉంటుంది. వేసవి అయేది, శీతాకాలమయేది సీల్‌లు తమ మంచుగుహలు విడిచి వెళ్లవు. బహుశా ఈ సొరంగాలు నేరుగా సముద్రంలోకి ఉంటాయి. ఎందుకంటే ఈ జంతువులు ప్రధానంగా చేపలు తిని జీవిస్తాయి.



శీతాకాలం వచ్చి తమ గుహల ద్వారాలు మంచు కప్పినప్పుడు ఈ జంతువులు తమ వాడిపళ్లతో మంచును కొరికి కంతలు చేస్తాయి. ఇవి మంచుమీద మనిషికన్న వేగంగా పరిగెత్తగలవు. అయినా వీటికి మనిషి భయం ఉన్నట్టు కనబడదు.

ఈ వింత జంతువులు ఉష్ణరక్తం గల సస్తన జంతువులు. ఈ దక్షిణ ధృవ ప్రాంతంలో ఇవి తప్ప మరే సస్తన జంతువులూ లేవు. శీతాకాలంలో ఆహారంగా ఉపయోగించుకునేటందుకు ఇవి తాము పట్టే చేపల తాలూకు కొవ్వు దాచుకుంటాయి. వీటి శరీరాలుకూడా బాగా కొవ్వి ఉంటాయి.



ఆడ సీల్ బిడ్డను కన్నాక వారం రోజుల పాటు ఆహారం తీసుకోదు. అయినా దాని పాలు తాగే పిల్ల రోజుకు ఏడు పౌనుల చొప్పున పెరుగుతుంది!

మంచుమీద కూడా ప్రయాణాలు జరిగాయి. ఇందుకుగాను 16 టన్నుల బరువు గల రెండు ట్రాక్టర్లు ఉపయోగించ బడ్డాయి. లోగడ పరిశోధకులు చక్రాలు లేని లాగుడుబళ్లకు కుక్కలను కట్టి ప్రయాణాలు చేసేవారు. ట్రాక్టర్లపై ప్రయాణాలు చేసేవారికి కూడా అనేక చిక్కులున్నాయి. పెద్ద పెద్ద కందకాలపైన పలుచని మంచు కప్పి ఉన్నట్టయితే ట్రాక్టరు బరువుకు పైనున్న మంచుపొర విరిగి ట్రాక్టరు కందకంలో పడిపోతుంది.

పైన చెప్పిన రెండు ట్రాక్టర్లు 280 మైళ్లు చుట్టి రావటానికి ఆరు రోజులు పట్టింది. ఈ ప్రయాణంలో వారు గమనించిన వింత ఏమంటే "చలిమావులు." ఎడారిలో ప్రయాణించేవారికి ఎండమావులు కనిపిస్తాయి; ఏమీ లేనిచోట నీరున్నట్టు కనిపిస్తుంది. దక్షిణ ధృవంలోకూడా అలాటి దృష్టి భ్రమలకు అవకాశం ఉంది. ప్రయాణీకులు తమ దారిలో నీలపురంగు మంచు గోడలున్నట్టూ, కొండలున్నట్టూ, మంచు పలకలు తేలే సముద్రజలం ఉన్నట్టూ భ్రమలుపడ్డారు.

మక్‌మర్డో తీరపు సముద్రంలో "హంతక తిమింగిలాలు" అసంఖ్యాకంగా ఉన్నాయి. ఒడ్డునే ఉన్న కొండ చరియలపై సీల్‌లూ, పెంగ్విన్‌పక్షులూ కనిపించాయి.

అంటార్కిటికా ఖండంలో అంతు లేని సంపద ఉన్నదనటానికి సందేహం లేదు. అక్కడ గనులు తవ్వే అవకాశమే ఉంటే ఎంతో రాక్షసిబొగ్గూ, నూనే, బంగారమూ, యురేనియమ్‌లాటి విలవైన లోహాలూ దొరుకుతాయి. కాని ఇప్పట్లో ఇక్కడ గని పరిశ్రమ సాధ్యంకాదు.



# నిజమైన సన్యాసి

ఒకానొక దేశపు రాజుగారికి పెద్ద జబ్బుచేసింది. తను జబ్బు నుంచి బతికి బయటపడితే, నగరంలోని సన్యాసులందరికీ, ఒక్కొకరికి ఒక బంగారు నాణెం చొప్పున ధర్మం చేస్తానని ఆయన మొక్కుకున్నాడు. తరవాత కొద్దిరోజులకే ఆయనకు వ్యాధి నిమ్మళించి, ఆరోగ్యం చిక్కింది. ఆయన తన సేవకుల్లో నమ్మకస్థుడైన వాణ్ణొకణ్ణి పిలిచి, వాడికి అయిదు వేల బంగారు నాణాలున్న సంచిని యిచ్చి, "ఒరే, నువ్వు నగరంలోకి పోయి, కనబడ్డ ప్రతి సన్యాసికీ ఒక్కొ నాణెం చొప్పున ధర్మం యిచ్చిరా," అన్నాడు.

నౌకరు నగరంలో సాయంకాలందాకా తిరిగి, రాజుగారిదగ్గిరకు వచ్చి, బంగారునాణాలున్న సంచిని ఆయనముందు పెడుతూ, "మహారాజా! నగరం అంతా గాలించాను; ఒక్కగానొక్క సన్యాసి అయినా కంటబడలేదు!" అన్నాడు.

నౌకరు అన్నమాటలు వింటూనే రాజుగారికి ఎక్కడ లేని కోపం వచ్చింది. ఆయన గద్దిస్తూ, "ఏమిరా నీ పొగరు! ఇంత మహానగరంలో నీకు సన్యాసే కనిపించలేదా? నగరంలో నాలుగైదు వేలమంది సన్యాసు లున్నట్టు నేను విన్నాను!" అన్నాడు.

అందుకు నౌకరు వినయంగా, "క్షమించండి, మహారాజా! సన్యాసి అయిన వాడు డబ్బు పుచ్చుకోడు; డబ్బు పుచ్చుకునేవాడు సన్యాసికాడు," అన్నాడు.



# వేటకుక్కా - ఊరకుక్కలూ

ఒక గొర్రెలకాపరి దగ్గిర మంచి వేటకుక్క ఒకటి వుండేది. అది యజమానితో పాటు అడవిలో గొర్రెలమంద వెంట కాపలా తిరుగుతూండేది. గొర్రెలకాపరి భార్య గ్రామాన్నుంచి భర్తకు అన్నం తెచ్చినప్పుడల్లా వేటకుక్కను చూసి అసహ్యించుకుంటూ, "దీనికి రోజూ మనిషికి సరిపడేంత తిండి కావాలి! దీన్ని తరిమేసి, నాలుగు ఊరకుక్కల్ని తెచ్చుకుంటే సరిపోదా? అవి గుప్పెడు మెతుకుల్తో తృప్తిపడి, మందకు నాలుగు వైపులా కావిలి పడుకుంటవి!" అంటూండేది.

ఇలా భార్య కొన్నాళ్లు పోరు పెట్టగా పెట్టగా, గొర్రెలకాపరి విసిగి, వేటకుక్కను తరిమేసి, నాలుగు ఊరకుక్కలను మందకు కాపలా వుండేందుకు తెచ్చుకున్నాడు. భార్య సంతోషించింది. ఊరకుక్కలుకూడా మందకు నాలుగు దిక్కులా కాపలావుంటూ, చీమ చిటుక్కుమంటే చాలు పెద్దగా మొరుగుతూండేవి.

ఒకనాటి రాత్రి గొర్రెలకాపరి గాఢనిద్రలో వుండగా, ఒక తోడేలు గొర్రెల మందకేసి వచ్చింది. తోడేలును చూస్తూనే, నాలుగు ఊరకుక్కలూ తోకలు ముడుచుకుని గ్రామంకేసి ఉడాయించినై.

తోడేలు స్వేచ్ఛగా మందలో జొరబడి గొర్రెలను చంపి తిని తన దారిన వెళ్లిపోయింది.






[ 6 ]

త్రమ రాజైన బింబిసారుడు బుద్ధుడి బోధలు విని ఆయన శిష్యుడైనాడని వినగానే రాజగృహంలోని ప్రజలు, "ఎవరీ బుద్ధుడు? ఈయన ఏమి బోధ చేస్తాడు? నిర్వాణ మంటే ఏమిటి?" అని వింతగా ప్రశ్నించ సాగారు. వారి ప్రశ్నలకు సరిఅయిన సమాధానాలు చెప్పేవారు లేనందున వారు పన్నెండు మైళ్లూ నడిచి బుద్ధుడున్న విహారానికి బయలుదేరారు. రోజూ వచ్చే పోయే జనంతో దారి కిటకిటలాడిపోయింది.

ప్రస్తుతం బుద్ధుడి విహారం ఉంటున్న యష్టివనం మరీ దూరమైపోయిందనీ, తాను రోజూ బుద్ధుణ్ణి చూసి, ఆయన సన్నిధిలో కొంతకాలం గడిపితేగాని తన మనసుకు తగినంత శాంతి ఉండదనీ బింబిసారమహారాజు భావించాడు. ఆయన తన ఉద్యానవనమైన వేలువనాన్ని బౌద్ధవిహారంగా మార్చ నిశ్చయించాడు. ఈ వనం చుట్టూ వెదురుపొద లుండేవట; అందుచేత ఈ వనానికి వేలువనమనే పేరు వచ్చింది.

బింబిసారుడు వేలువనాన్ని బుద్ధుడికి శాస్త్రోక్తంగా, చేతిలో నీరుపోసి ధార పోశాడు. ఇది బుద్ధుడుండిన నివాసాలన్నిటిలోకి అత్యంత ప్రసిద్ధమయింది.

రాజగృహానికి కొద్దిదూరంలోనే కోలితమూ, ఉపతిశ్యమూ అని రెండు బ్రాహ్మణ గ్రామాలుండేవి. వాటిని కోలితుడూ, ఉపతిశ్యుడూ అనే క్షత్రియులు పాలించేవారు.





ఉపతిశ్యుడూ కొంతకాలం ఈ సంగుడి వద్ద చేరి ఆయనకు శుశ్రూష చేశారు, కాని సంగుడు వారికి మోక్షమార్గం చూపలేక పోయాడు. ఆ తరవాత వారు అనేక దేశాలు సంచారంచేసి కనిపించినవారినల్లా అనేక ప్రశ్నలు వేశారు. ఒక్కరుకూడా వారి అనుమానాలు తీర్చలేకపోగా, వారు రాజ గృహానికి తిరిగి వచ్చారు.

ఈ సమయంలో బుద్ధుడు వేలువనంలో ఉంటున్నాడు. ఈలోపల అశ్వాజీ అనే బుద్ధశిష్యుడు దేశసంచారం చేసి బుద్ధుడు అవతరించాడని దేశదేశాలా ప్రచారంచేసి, రాజగృహానికి తిరిగివచ్చాడు. వచ్చిన మర్నాడే అశ్వాజీ భిక్షాపాత్ర తీసుకుని భిక్ష కోసం ఇల్లిల్లూ తిరగసాగాడు. ఇలా తిరుగుతూ ఆయన ఉపతిశ్యుడికి కనిపించాడు.

ఉపతిశ్యుడు అశ్వాజీని చూసి సంతోషించి తన ఇంటికి భిక్షకు రమ్మని ఆహ్వానించాడు. అశ్వాజీతో కొంతసేపు సంభాషించినాక ఉపతిశ్యుడు, "అయ్యా, తమ సంభాషణ వింటుంటే తమకు మోక్షమార్గం అర్థమైనట్టున్నది. తమకు ఉపదేశం చేసిన గురువెవరు?" అని అడిగాడు.

"నా గురువు గౌతమబుద్ధుడు," అని అశ్వాజీ సమాధానం చెప్పాడు.

వారి కుటుంబాల మధ్య ఏడు తరాలుగా స్నేహ సంబంధాలుంటున్నాయి. కోలితుడికి అయిదు వందల రథాలుండేవి, ఉపతిశ్యుడికి అయిదు వందల బంగారు మేనాలుండేవి. వారిలో ఒకరు ఏం చేస్తే రెండో వారు అదే చేసేవారు, ఒకేరకం వినోదాలలో కాలం గడిపేవారు. అయితే వారికిద్దరికీకూడా జన్మపరంపరలమీద విముఖత్వం కలిగింది. సుఖాలలో కాలం గడపటంచేత నిర్వాణం, లేక జన్మవిముక్తి, కలగదని వారు నిశ్చయించుకున్నారు.

ఆ కాలంలో రాజగృహంలో సంగుడనే ప్రసిద్ధ పరివ్రాజకుడుండేవాడు. కోలితుడూ,



"ఆయన చెప్పే సిద్ధాంతా లేమిటి ?" అని ఉపతిశ్యుడు అడిగాడు.

ఈ ఉపతిశ్యుడు బుద్ధవ్యతిరేకి అన్న అనుమానం కలిగి అశ్వాజీ, "నాయనా, నేను కొత్తగా శిష్యత్వం పొందినవాణ్ణి. ధర్మం అపారమైనది. దాన్ని నేను నీకు ఎలా వివరించగలను ?" అన్నాడు.

"ఫరవాలేదు. నేను సత్యాన్ని అన్వేషించేవాణ్ణే. నాకు కొంచెం అందించారంటే అల్లుకుపోగలను. మీరు ఒక్క సత్యం చెబితే, దానినుంచి వందలూ, వేలూ సత్యాలు ఊహించగలను," అన్నాడు ఉపతిశ్యుడు.



అప్పుడు అశ్వాజీ ఈ శ్లోకం చదివాడు :

"యే ధమ్మ హేతుప్పభవా,
యేసన్ హేతున్ తథాగతో,
అహ యేసన్ చ యో నిరోధో,
ఏవన్ వది మహా సమనో."

[ప్రతిదీ ఒక కారణాంతరంవల్లనే ఏర్పడుతుంది. ఈ కారణాన్ని తత్వజ్ఞులు ప్రకటించారు. వీటన్నిటినీ (జన్మపరంపరను) నిరోధించవచ్చును. ఇదే మహాశ్రమణుడు (బుద్ధుడు) చెప్పిన సంగతి.]

ఈ మాటలు వినగానే ఉపతిశ్యుడు పరమానందభరితుడై అశ్వాజీని ఆలింగనం చేసుకుని, "మీ మాటలు నాకు తృప్తి కలిగించాయి. బుద్ధుడియందు నాకు విశ్వాసం కుదిరింది. ఆయన ఎక్కడ ?" అని అడిగాడు.

అశ్వాజీద్వారా బుద్ధుడుండే చోటు తెలుసుకున్నాక ఉపతిశ్యుడు తన మిత్రుడైన కోలితుడి వద్దకు వెళ్ళి, "మిత్రమా, నాకు నిర్వాణమార్గం దొరికింది," అంటూ అశ్వాజీ చదివిన శ్లోకాన్ని చదివాడు.

కోలితుడికికూడా బుద్ధుడు జన్మరాహిత్యం ఉపదేశించగలడని నమ్మకం కలిగింది. ఇద్దరూ కలిసి తమ మొదటి గురువైన సంగుడి వద్దకు వెళ్లారు. సంగుడు వారు చెప్పినదంతా విని, తల అడ్డంగా






చేస్తున్నాడు. కోలితుణ్ణీ, ఉపతిశ్యుణ్ణీ దూరానే చూసి ఆయన, "నా ప్రధాన శిష్యులిద్దరూ వస్తున్నారు!" అన్నాడు.

వారిద్దరూ బుద్ధుడికి వందనప్రణామాలు చేసి తమకు తత్వం ఉపదేశించమని ప్రార్థించారు. బుద్ధుడు వారితో, "నన్ను ఆశ్రయించండి. కష్టాలనుండి విముక్తి పొందటానికిగాను బ్రహ్మచర్యదీక్ష పూనండి. మీకు చక్కని మోక్షమార్గం ఉపదేశిస్తాను!" అన్నాడు.

తరవాత ఉపతిశ్యుడూ, కోలితుడూ, సంగుడి శిష్యులు రెండువందల యాభై మందీ బౌద్ధులైపోయారు. కోలితుడు తన పేరు మార్చుకుని ముగలనుడు అయాడు, ఉపతిశ్యుడు సేరియుతుడయాడు. వీరిద్దరూ బుద్ధుడి ప్రధాన శిష్యులయారు.

ఇది జరిగిన కొద్దిరోజుల అనంతరం ఒక పౌర్ణమినాటి రాత్రి రాజగృహంలో ఒక ప్రముఖ సమావేశం జరిగింది. ఈ సమావేశంలో విశేషమేమిటంటే ఆ సమావేశానికి వచ్చినవారంతా ఆహ్వానాలు లేకుండానే వచ్చారు. అందులో పాల్గొన్నవారంతా అర్హతుల శ్రేణికి చెందినవారే. ఆ సమావేశంలో బుద్ధుడు తన శిష్యులను ఈ విధంగా అనుశాసించాడు:

తిప్పి, "నేను బుద్ధుడి వద్దకు రావటం సాధ్యంకాదు. నా కీర్తి జంబూద్వీపమంతా వ్యాపించింది. అటువంటివాణ్ణి మరొకడికి శిష్యుణ్ణి అవుతానా?" అన్నాడు.

సంగుడివద్ద ఉంటున్న శిష్యులు అయిదు వందలమందీ మటుకు బుద్ధుణ్ణి దర్శించటానికి బయలుదేరారు. ఇది చూసి సంగుడు కళ్ల నీళ్లపర్యంతం వచ్చాడు. అందుచేత ఆయన శిష్యులలో సగంమంది ఆయన వెంట ఉండిపోయారు. మిగిలినవాళ్లు కోలిత ఉపతిశ్యులవెంట బుద్ధుణ్ణి చూడబోయారు.

వారు విహారాన్ని చేరే సమయానికి బుద్ధుడు తనచుట్టూ చేరినవారికి ఉపదేశం





" సబ్బ పాపస్స అకరణన్ :
కుశలస్స ఉపసంపదా :
స చిత్త పరియో దపనన్ :
ఏతన్ బుద్ధానుశాసనన్."

[ఎట్టి పాపాలూ చేయవద్దు; ప్రతి సద్గుణాన్నీ సాధించాలి; మనస్సు స్వాధీనంలో ఉంచుకోవాలి; ఇదే బుద్ధుడి శాసనం.]

బుద్ధుడు వేలువనంలో ఉంటుండగానే కపిలవస్తు నగరంలో ఉన్న శుద్ధోదన మహారాజుకు తన కుమారుడు బుద్ధుడయాడని వార్త తెలిసింది. ఆయన ఒక క్షత్రియ పుంగవుడి వెంట వెయ్యిమంది పరివారాన్ని ఇచ్చి తన కుమారుడికి ఈ విధంగా సందేశం పంపాడు :

"నాకు నిన్ను చూడాలని ఉన్నది, కనుక నీవు రావలెను. అందరూ నీ బోధలు వింటున్నారుగాని నీ తండ్రీ, నీ ఇతర బంధు జనులూ వినటం జరగలేదు. మేము నిన్ను చూసి ఇప్పటికి ఏడేళ్లయినది."

బుద్ధుడికి ఈ సందేశం అందజేయటానికి శుద్ధోదనుడి దూత సపరివారుడై విహారం చేరుకునే సమయానికి బుద్ధుడు సమావేశమైనవారికి ప్రబోధంచేస్తున్నాడు. ఆ క్షత్రియుడూ, ఆయనవెంట వచ్చిన వెయ్యిమందీ ప్రబోధం విని బుద్ధుడి శిష్యులైపోయారు. వారు శుద్ధోదనుడి సందేశం బుద్ధుడికి అందించలేదు.

వెళ్లినవారు ఎంతకూ తిరిగి రాకపోవటం చూసి శుద్ధోదనుడు మరొక దూతను పరివారంతోసహా పంపాడు. కాని వారుకూడా మొదటివారిలాగే బుద్ధుడి శిష్యులై విహారంలోనే నిలిచిపోయారు. శుద్ధోదనుడు ఈ విధంగా మరి ఏడుగురు దూతలను పంపాడు. వేలువనం చేరగానే అందరూ బుద్ధుడి శిష్యులయారు, ఒక్కరూ తిరిగి రాలేదు, శుద్ధోదనుడి సందేశం బుద్ధుడికి అందించనుకూడా లేదు.



వారందరూ తనకు ఆప్తులు కాని కారణం చేత తన ఆజ్ఞలను పాలించలేదనుకుని శుద్ధోదనుడు ఈసారి తనకు ఆప్తుడైన కాలుదాయి అనేవాణ్ణి పిలిచి, అతనితో, "నాకు చనిపోయే లోగా నా కుమారుణ్ణి చూడాలని ఉన్నది. వాణ్ణి పిలుచుకురమ్మని తొమ్మిది మందిని తొమ్మిది వేల బలగంతో పంపాను; ఒకడూ తిరిగిరాలేదు. నీవువెళ్ళి వాడితో నేను రమ్మన్నానని చెప్పివస్తావా ?" అన్నాడు.

కాలుదాయికూడా బుద్ధుణ్ణి చూడబోయి ప్రబోధం విని ఆయన శిష్యుడుగా చేరి పోయాడు. తరవాత వారంరోజులకు వసంత రుతువు ఆరంభమయింది. ఎక్కడ చూసినా



పచ్చనిగడ్డి కానవచ్చింది. అరణ్యావృక్షాలన్నీ పుష్పించాయి. బుద్ధుడు తనవారిని చూడ బోవటానికి ఇదే తరుణమని నిర్ణయించి కాలుదాయి ఆయనవద్దకు వెళ్ళి, రాజగృహం నుంచి కపిలవస్తుకు వెళ్ళే మార్గంయొక్క శోభను వర్ణించసాగాడు.

బుద్ధుడీ వర్ణనను కొంతసేపు విని, "ఇదంతా నాకెందుకు చెబుతున్నావు ?" అని అడిగాడు.

"మరేమీ లేదు. సూర్యుడికోసం పద్మమూ, చంద్రుడికోసం కమలమూ ఎలా నిరీక్షిస్తాయో, మీ కోసం మీ తండ్రీ, మారు తల్లీ అలా నిరీక్షిస్తున్నారు," అన్నాడు కాలుదాయి.

బుద్ధుడు కాస్సేపు ఆలోచించి, తన జన్మస్థలానికి వెళ్ళే తరుణం సమీపించిందని భావించి, "అలాగే; రేపు ఉదయం బయలు దేరి పోదాం!" అన్నాడు.

మర్నాడు బుద్ధుడు కపిలవస్తునగరానికి ప్రయాణమయాడు. ఆయన వెంట అంగ, మగధదేశాలకు చెందిన శిష్యులు పదివేల మందీ, కపిలవస్తునుంచి వచ్చిన శిష్యులు పదివేలమందీ కదిలారు. వీరు రోజుకు పదహారు మైళ్లు ప్రయాణం చేస్తూ రెండు నెలలకు కపిలవస్తు చేరుకున్నారు.



బుద్ధుడింకా కపిలవస్తు చేరకపూర్వమే కాలుదాయి ముందు నడిచి శుద్ధోదనుడి ఇంటికి వెళ్లాడు. శుద్ధోదనుడు అతన్ని చూసి పరమానందభరితుడై అతనికి భోజనం పెట్టించాడు. కాని కాలుదాయి ఆ భోజనాన్ని తన భిక్షాపాత్రలో వేసుకుని తిరిగి వెళ్లటానికి లేచాడు.

"ఎందుకు వెళ్లిపోతున్నావు? భోజనం చెయ్యి," అన్నాడు శుద్ధోదనుడు.

"లేదు, నేనీ భోజనాన్ని బుద్ధుడికి ఇస్తాను," అన్నాడు కాలుదాయి.

"బుద్ధుడెక్కడ?" అని శుద్ధోదనుడు అడిగాడు.

"ఇక్కడికే వస్తున్నాడు. దారిలో ఉన్నాడు," అన్నాడు కాలుదాయి.

"బుద్ధుడికి నేను వేరే భోజనం ఇప్పిస్తాను. ఈ ఆహారం తిని మరీ వెళ్లు," అన్నాడు శుద్ధోదనుడు.

కాలుదాయి సరేనని భోజనంచేశాడు. శుద్ధోదనుడు అతని భిక్షాపాత్రను సుగంధ జలంతో కడిగించి, అందులో ఉత్తమమైన ఆహారం పెట్టించి కాలుదాయిద్వారా బుద్ధుడికి పంపాడు.

ఆపూట బుద్ధుడు తన తండ్రి పంపిన ఆహారమే భుజించాడు.



తరవాత శుద్ధోదనమహారాజు బుద్ధుడి విడిదికోసం న్యగ్రోధవనాన్ని సిద్ధం చేయించాడు, అది పూర్వం న్యగ్రోధుడనే శాక్యరాజు నిర్మించినది.

బుద్ధుడు కపిలవస్తునగరద్వారం చేరుకునేసరికి ఆయనకు స్వాగతం చెప్పటానికి వెళ్లే ఊరేగింపుజనంలో ముందుగా అయిదు వందలమంది బాలబాలికలు, సుమారు పదహారేళ్ల వయస్సువారున్నారు; వారి వెనకగా పన్నెండేళ్ల వయస్సు గల రాజకుమారులూ, రాజకుమార్తెలూ ఉన్నారు; వారి వెనకగా నూట అరవైవేలమంది పరివారంతో రాజుగారు నడిచారు.



ఈ ఊరేగింపువెంట బుద్ధుడు తన విడిది అయిన ఉద్యానం ప్రవేశించి ఒక ఎత్తయిన ఆసనంపైన కూచున్నాడు. ఆయన శిష్యులు ఇరవైవేలమందీ ఆయనచుట్టూ కూచున్నారు. బుద్ధుణ్ణి చూడవచ్చిన శాక్యులలో పెద్దలైనవారు చిన్నవారితో, "మీరు బుద్ధుడికి పాదాభివందనం చెయ్యండి," అని చెప్పి తాము ఎడంగా కూచున్నారు. తాము బుద్ధుడికన్న పెద్దవాళ్ళమనీ, బుద్ధుడికి వరసకు పినతండ్రులూ, పెత్తండ్రులూ, తాతలూ అవుతామనీ, అందుచేత వందనం చేయ నవసరంలేదనీ వారు భావించారు.

బుద్ధుడు లేచి నిలబడ్డాడు. మరుక్షణం అక్కడ చేరిన వారందరూ ఇద్దరు బుద్ధులను వేరువేరుగా చూడగలిగారు. ఆయన శరీరంలో నుంచి ఆరు రంగుల కిరణాలు ప్రసరించటం అందరికీ కనిపించింది. తరవాత ఆయన అనాగత వంశవృత్తాంతం అనే మైత్రీ బుద్ధుడి చరిత్ర చెప్పాడు.

బుద్ధుడి ప్రసంగం ముగియగానే శుద్ధోదనమహారాజు లేచి తన కుమారుడి ముందు మూడవసారిగా సాష్టాంగపడి, "నాయనా, బుద్ధభగవానుడా! నీకు లోగడ రెండుసార్లు సాష్టాంగప్రణామం చేసిఉన్నాను. నీవు నా కడుపున కొడుకువై పుట్టినప్పటికీ ఇకనుంచీ నిన్ను నాకొడుకుగా భావించను. ఎందుకంటే నేను నీకు దాసుడుగాకూడా పనికిరాను. నాకు తెలుసును. నా రాజ్యమంతా ఇస్తానన్నప్పటికీ అది నీకు బుగ్గితో సమానం!" అన్నాడు.

శుద్ధోదనుడు ఈ మాటలు అనగానే పెద్దలందరి అహంకారమూ అణగారింది. వారందరూ బుద్ధుడికి సాష్టాంగ దండప్రణామాలు చేశారు. సందేహాలున్న వారందరికీ సందేహాలు తీరిపోయాయి.

ఈ సందర్భంలో బుద్ధుడు అక్కడ ఉన్న వారికి విశ్వంతర జాతక కథ చెప్పాడు.

—(ఇంకా వుంది)






ఒకనాడు ఒక జమీందారుగారి దగ్గిరికి ఒక వింతమనిషి వచ్చాడు. వాడి వంటిపైన ఉన్న బట్టలు చినిగిపోయి ఉన్నాయి. వాడి చెవులు పైకి పొడుచుకు వస్తున్నాయి.

జమీందారుగారి నౌకర్లు వాడితో, "ఎవరు నువ్వు? ఇక్కడ నీకేం పని?" అన్నారు.

"నేను గారడీవాణ్ణి. ఏలినవారి దగ్గిర గారడీ చేసి బహుమానం పొందుదామని వచ్చాను," అన్నాడు వింతమనిషి.

నౌకర్లు వాడి మాటలు నమ్మలేదు. ఎందుకంటే గారడి చేసేవాళ్లదగ్గిర సంచి కట్టూ, మంత్రదండమూ ఉంటుంది. వాళ్లు తలపాగాలు పెట్టుకుని ఆర్భాటంగా ఉంటారు. ఈ వింతమనిషిలో గారడీవాడి లక్షణం ఒక్కటీ లేదు.

"నువు గారడీ చెయ్యట మేమిటి? బాబుగారు నీకు డబ్బివ్వకపోగా మెత్తగా తన్ని పంపిస్తారు. వెళ్లు, వెళ్లు!" అని నౌకర్లు ఆ మనిషిని పంపెయ్యజూశారు.

"తన్నులు నేనేకదా తింటాను! గారడీ వాడు వచ్చాడని ప్రభువువారితో చెప్పండి," అన్నాడు ఆ మనిషి.

నౌకర్లు అలాగే చేశారు. లోపలి ఆవరణలో జమీందారుగారు తన మిత్రులతోనూ నౌకర్ల తోనూ కూచుని ఉన్నాడు. అందరికీ వినోదంగా ఉంటుందని ఆయన గారడీవాణ్ణి ప్రవేశపెట్టమన్నాడు.

ఆయన గారడీవాడితో, "నువు ఏం గారడీ చేస్తావురా? మేం గొప్ప గొప్ప గారడీలు చాలా చూశాం. కొత్త విద్య ఏమైనా చూపగలిగితే చూపు. లేకపోతే నీదారిన నీవు పో. అంతేగాని చచ్చు గారడీ చేస్తే మేం సహించం!" అన్నాడు.

"తమరే చిత్తగించండి. నేను చేసే గారడీ చాలా కొత్తగా ఉంటుంది!" అంటూ గారడీవాడు మూడు గడ్డిపోచలు ఏరాడు.

సి. ధర్మయ్య

"వీటిని నా అరిచేతిలో పెట్టి ఊదుతాను. మధ్య ఉండే గడ్డిపోచమాత్రం ఎగిరిపోయే టట్టు చేస్తాను!" అన్నాడు వాడు.

"అది కష్టమైన పనే. ఏదీ చెయ్యి చూతాం!" అన్నాడు జమీందారు. గారడీ వాడు మూడు గడ్డిపోచలనూ తన ఎడమ అరిచేతిలో పెట్టుకున్నాడు. తన కుడిచేతి వేళ్లతో అటూ ఇటూ ఉన్న గడ్డిపోచలను నొక్కిపట్టి ఊదాడు. మధ్యనున్న గడ్డిపోచ ఎగిరిపోయింది.

"ఇది ఎవరు చేయలేరు?" అన్నాడు జమీందారు అంతరంగికు డొకడు.

"ఏదీ? మీరు చెయ్యండి!" అన్నాడు గారడీవాడు.

జమీందారు మనిషి గారడీవాడిలాగే ఎడమ అరిచేతిలో గడ్డిపోచలు ఉంచి, వాటిలో రెండిటిపై కుడిచేతి వేళ్లు నొక్కిపట్టి ఊదాడు. వెంటనే పెద్ద మెరుపు మెరిసింది. అందరూ కళ్లు మూసుకున్నారు. వాళ్లు మళ్లీ కళ్లు తెరిచి చూసేసరికి అతని ఎడమ అరిచెయ్యి ఊడి కింద పడిఉంది.

"బాబుగారూ, ఇంకొక విద్య చూపిస్తాను. నా చెవులు చూశారుగదా, వీటిలో ఒక్క దాన్ని మాత్రమే కదిలిస్తాను!" అన్నాడు గారడీవాడు.

"అది కష్టమే! కదిలించు చూద్దాం!" అన్నాడు జమీందారు. వెంటనే గారడీవాడు తన చేతితో తన కుడిచెవిని ఆడించాడు.

ఎడమచెయ్యి పోగొట్టుకున్న వాడికి మండి పోయింది. "ఇదీ ఒక విద్యేనా?" అంటూ అతను తన కుడిచెవిని పట్టుకున్నాడు. మళ్లీ మెరుపు మెరిసింది. ఈలోపుగా జమీందారు మనిషి చెవి ఊడి చేతిలోకి వచ్చింది.

జమీందారు గారడీవాడి తెలివికి మెచ్చుకుని వాడికి మంచి బహుమతి ఇచ్చాడు. గారడీవాడు జమీందారుగారి మనిషితాలూకు చెయ్యీ చెవీ మామూలుగా ఉండేలాగు చేసి తన దారిన వెళ్లిపోయాడు.






తల్లి:
చొక్కా ఎట్లా చినిగిందిరా?
కొడుకు:
నిలువుగా చిరిగిందమ్మా!




"కళ్లద్దాలు పెట్టుకుంటే కన్నునొప్పి తగ్గిందా?"

"కంటినొప్పి తగ్గిందిగాని, చెవినొప్పి, ముక్కునొప్పి పట్టుకున్నాయి."




అన్న: చొక్కా ఎంత వదులయిందో చూడు.
తమ్ముడు: చెంబెడునీళ్లు తాగు, వదులు తెలియదు.




పోలీస్: ఏయ్, ఆగు!
సైక్లిస్టు: ఉండవయ్యా, ఇప్పటికే ఓవర్‌లోడ్ అయితేనూ!



# "బాతుముక్కు" ప్లాటిపస్

వింత సస్తన జంతువులను గురించి లోగడ [ చందమామ, 1957 జూలై ] మీరు చదివినప్పుడు వాటిలో "బాతు ముక్కు" ప్లాటిపస్‌ను గురించి సంగ్రహంగా తెలుసుకున్నారు. ఆ వింత జంతువు గురించి ఇప్పుడు మరింత వివరంగా తెలుసుకుందాం :

"బాతుముక్కు" నిజంగా విడ్డూరమైన జంతువే. దానికి చేప లక్షణాలూ, పక్షి లక్షణాలూ, పాకే జంతువుల (సరీసృపాల) లక్షణాలూ, జంతువుల లక్షణాలూ కూడా ఉన్నాయి. దీనికి బాతులకుండే ముక్కులాటి ముక్కున్నది; శరీరం నిండా బొచ్చున్నది; నాలుగు కాళ్లున్నాయి ; ఆడ "బాతుముక్కు" గుడ్లు పెట్టి, వాటిని పొదుగుతుంది, మళ్లీ వాటికి పాలిచ్చి పెంచుతుంది.

ప్రపంచంలో ఈ రకం జంతువులు ఆస్ట్రేలియా తూర్పుతీరానా, దానికి ఉత్తరంగా ఉన్న టాస్మానియాలోనూ మాత్రమే ఉన్నాయి. పది, పదిహేను కోట్ల సంవత్సరాల క్రితం ప్రపంచంలో సస్తన జంతువులు ఈ "బాతుముక్కు" లాగే సంకరలక్షణాలు కలిగి ఉండేవి. ఆ సస్తన జంతువులు క్రమంగా పరిణామం చెందాయి, పరిణామం చెందలేనివి కాలగర్భంలో కలిసిపోయాయి. అలా అంతరించిపోకుండా నిలబడివున్న ఒకటి, రెండు పురాతన సస్తన జాతులలో చేరినదైన "బాతుముక్కు"ను చూసి మనం ఈనాడు అత్యాశ్చర్యం చెందుతున్నాం.

ఆస్ట్రేలియాలో కూడా "బాతు ముక్కులు" అంతరించిపోయి ఉండేవే;



విషపు ఆరెలు

ఏమంటే వాటి చర్మాలు చాలా మెత్తగా ఉండి, మంచి వెల తెస్తాయి. అందు కని అందరూ వాటిని పట్టసాగారు. అయితే అక్కడి ప్రభుత్వం శాసనం ద్వారా "బాతుముక్కు" లను పట్టడం నిషేధించింది. అటుతరవాత కొందరు వాటిని తమ ఇళ్లలో పెంచటం కూడా నేర్చారు.

వీటిని ఇప్పుడు జంతు ప్రదర్శన శాలలు కూడా తెచ్చి పోషిస్తున్నాయి. కాని "బాతుముక్కు"ను మచ్చిక చెయ్యటం అంత సులువైన పని కాదు. ఎందుకంటే అవి చాలా పిరికివి. సహజ వాతావరణంలోనే అవి రవ్వంత అలికిడి అయితే పారిపోయి దాక్కుంటాయి. వాటికి శ్రవణ శక్తి హెచ్చు. అదీగాక వాటి జీవిత విధానం వింతగా ఉంటుంది. వాటిని పెంచ దలచినవారు వాటికి తగిన వాతావరణం కల్పించాలి, ఆహారం అందించాలి.

అవి రాత్రించరాలు. అవి రాత్రి వేళనే బయటికి వచ్చి, నీటిలో ఈదు తాయి, ఆహారం తింటాయి. పగటి వెలుతురులో వాటికి కళ్లు సరిగా కన పడవని కొందరి ఉద్దేశం. ఎందుకంటే అవి పగటివేళ నీటిపై ఈదేటప్పుడు దారికి అడ్డంగా ఉండే వస్తువుకు వెళ్లి కొట్టుకుంటాయి. దీనికి మరొక కారణం కూడా ఉండవచ్చు. వాటి కళ్లు ఎగువగా ఉన్న వస్తువులను చూడ టానికి అనుకూలంగా ఏర్పాటై ఉన్నాయి గాని, ఎదురుగా ఉండే వాటిని చూడటానికి అంత అనువుగా లేవు.

నీటి అడుగున ఈదేటప్పుడు "బాతు ముక్కు" కళ్లనూ, చెవులనూ కూడా మూసుకుంటుంది; కళ్లను మూసేరెప్ప చెవులనుకూడా మూసేస్తుంది. దాని

ముక్కునిండా "నరాలే." అది కేవలం స్పర్శజ్ఞానంతో తన ఆహారాన్ని ఏరు కుంటుంది. ఏ కారణంచేతనో అది తన ఆహారంతోబాటు దానికి అంటుకుని ఉన్న మట్టినికూడా మింగుతుంది. అందుచేత ప్రతి "బాతుముక్కు" పొట్ట లోనూ విధిగా మట్టి కనిపిస్తుంది. వాటిని పెంచేవారుకూడా ఆహారంతోబాటు కొంత మట్టిని పెట్టాలి.

ఆడ "బాతుముక్కు" సామాన్యంగా రెండు గుడ్లు పెడుతుంది; ఒక్కొక్కప్పుడు ఒకటీ, అరుదుగా మూడూ గుడ్లు పెట్టటంకూడా కద్దు. గుడ్లు పెట్టే తరుణం దగ్గిరపడినప్పుడు అది తాను ఆశ్రయించిన ప్రవాహం ఒడ్డులోకి ఒక సొరంగం తవ్వుతుంది. ఈ సొరంగం 30 మొదలు 80 అడుగుల పొడుగు దాకా ఉండవచ్చు. అది సొరంగం తవ్వుకుంటూ పోయేటప్పుడు మధ్య మధ్యన సొరంగానికి "అడ్డగోడలు" మట్టితో అమర్చుకుంటూ పోతుంది. సొరంగం చిట్టచివరను అది ఆకుల తోనూ, తుంగతోనూ ఒక గూడు కట్టి అందులో గుడ్లు పెడుతుంది. ఇవి తోలు గుడ్లలాగుంటాయి, వాటిపైన




"బాతుముక్కు" శిశువులు

పెంకు ఉండదు. అది ఆ సొరంగం లోనే ఉండిపోదు; మధ్య మధ్య బయటికి వచ్చి లోపలికిపోతూ ఉంటుంది, కాని అలా వచ్చిపోయినప్పు డల్లా శ్రద్ధగా అడ్డగోడలు మాత్రం కట్టుతూ ఉంటుంది.

మగ బాతుముక్కుకూడా సొరంగాలు తవ్వుకుంటుంది, కాని అవి అంత నిడివిగా ఉండవు. పిల్లలు పెట్టనప్పుడు ఆడదికూడా చిన్న సొరంగాలలోనే ఉంటుంది. మగ, ఆడ "బాతు

ముక్కులు" ఒకే సారంగంలో ఎన్నడూ నివసించవు.

బాతుముక్కు పెట్టే గుడ్లు పిచ్చుక గుడ్లంత ఉంటాయి. తల్లి వాటిని తన తోకకూ, శరీరానికీ మధ్య ఉంచుకుని పొదుగుతుంది. పన్నెండు రోజుల అనంతరం గుడ్లు పొదిగి పిల్లలు బయటికి వస్తాయి. కాని ఆ స్థితిలో అవి కళ్లు లేకుండా, శరీరంపై ఒక్క రోమం కూడా లేకుండా పిండాకృతి కలిగి, అసహాయ స్థితిలో ఉంటాయి. ఈ పిల్లలు తల్లి రొమ్మును తడివినప్పుడు రొమ్ములోని చర్మ రంధ్రాలకుండా పాలు స్రవిస్తాయి; ఆ పాలను పిల్లలు తమ ముక్కులతో నాకేస్తాయి.

బాతుముక్కు మాంసాహారి. అది హెచ్చుగా పురుగులను తింటుంది. అది నీటిలో ఈదేటప్పుడు దాని ముందు కాళ్లనుమాత్రమే కదిలిస్తుంది; అవి జాల పాదాలు. వెనకకాళ్లు దానికి చుక్కానిలాగా మాత్రమే ఉపయోగిస్తాయి. దాని తోక పొట్టిగా, బలంగా ఉంటుంది. అందులో కొవ్వు ఉంటుంది. అది ఆహారం తినకుండా "నిరశనం" పట్టినప్పుడు తోక చిక్కిపోతుంది.

"బాతుముక్కు" వెనక కాళ్లకు విషంతో కూడిన ఆరెలుంటాయి. వాటి కాటువల్ల చేతులు వాచి వారం రోజులు తీసుకున్నవాళ్లున్నారు.

చిత్రమేమిటంటే "బాతుముక్కు" పురాతన జాతి జంతువై ఉండికూడా సులువుగా మనిషికి అలవాటు పడుతుంది. పెంపుడు బాతుముక్కులలో ఈల వేస్తే ఆహారంకోసం వచ్చేవీ, చీపురుతో అడిస్తే సంతోషంగా ఆడేవీ కూడా ఉన్నాయి.



# పైపటారం

ఒక రాజుగారి కొక కొడుకుండేవాడు. వాడు అస్తమానమూ వీధులవెంట తిరుగుతూ, బీద వాళ్లతోనూ బిచ్చగాళ్లతోనూ సఖ్యం చేస్తూ, వాళ్లకు దానధర్మాలు చేస్తూఉండేవాడు. విందులూ, వినోదాలూ, నృత్యగానాలు వాడికి పట్టేవికావు.

వాడి మనసు మార్చటానికి రాజుగారు ఎన్నో ప్రయత్నాలు చేశాడు, కాని లాభంలేక పోయింది. చివర కాయన ప్రాణం విసిగి, "ఈ దరిద్రుడు నా కడుపు చెడబుట్టాడు. వీణ్ణి తీసుకుపోయి కొరతవెయ్యండి!" అన్నాడు.

రాజుకొడుకు తన తండ్రితో, "నాకు రెండు ఘడియలు వ్యవధి ఇచ్చి తరవాత అలాగే కొరతవెయ్యండి!" అన్నాడు. రాజు సరేనన్నాడు.

రాజుకొడుకు ఎక్కడికో వెళ్లి మూడు పెట్టెలు పట్టుకొచ్చాడు. ఒకటి బంగారపుది, రెండవది వెండిది, మూడవది కొయ్యది. "వీటిలో ఏది ఉత్తమమైనదో ఏవరైనా చెప్ప గలరా?" అన్నాడు రాజుకొడుకు సభవారితో.

అందరూ బంగారపు పెట్టె ఉత్తమమనీ, వెండిది మధ్యమమనీ, కొయ్యది అధమమనీ అన్నారు. రాజుకొడుకు మూడు పెట్టెలూ తెరిచాడు. బంగారుపెట్టెలో తేళ్లూ, పాములూ ఉన్నాయి; వెండిపెట్టె నిండా కంకరరాళ్లూ గులకరాళ్లూ ఉన్నాయి; కొయ్యపెట్టెలో మేలి రత్నాలున్నాయి.

"పై మెరుగులు చూసి భ్రమపడకండి. మనుషులుకూడా ఇంతే. పేదవాళ్లంతా చెడ్డ వాళ్లనీ, సంపన్నులంతా మంచివారనీ అనుకోవద్దు!" అన్నాడు రాజుకొడుకు.

రాజుగారు వాణ్ణి క్షమించి ఆదరించాడు.





"పంతులుగారూ, మీరు ఇంకో ట్రిప్‌లో ఎక్కుదురుగాని!"



"ఈయన ఇలా చాలాసార్లు దూకుతాడురా! మనకు కావలిసినన్ని చేపలు!"




"కూర్చోండి, సార్. ఈ సీటు ఖాళీయే!"




"కదలకు, నాన్నా! దూకుతున్నాను!"

# మీకు తెలుసా?

ఉప్పువల్ల 14000 ఉపయోగాలున్నాయి. వంటలోనూ, ఊరగాయలకూ ఉపయోగపడటం వాటిలో ఒకటి మాత్రమే. అలా ఉపయోగపడే ఉప్పు చాలాకొద్ది.

*　　　*　　　*

ప్రపంచంలోకల్లా లోతైన గని కోలారులో ఉన్నది. దాని లోతు 10,030 అడుగులు, లేక ఇంచుమించు రెండు మైళ్లు. దాని లోతు ఏడాదికి 250 అడుగుల చొప్పున పెరుగుతున్నది.

*　　　*　　　*

అమెరికాలో పనికి వెళ్లేవాళ్లు ముగ్గురిలో ఇద్దరు కార్లలో వెళతారు. నూటికి 8మంది బస్సులలోనూ, ముగ్గురు అండర్‌గ్రౌండ్ రైళ్లలోనూ, ఒకడు రైళ్లలోనూ వెళతారు. నూటికి 10 మంది నడిచి వెళతారు!

*　　　*　　　*

గుర్రాలూ, కుక్కలూ, పిల్లులూ, కోతులూ, పందులూ, మేకలూ, చెవులపిల్లులూ మొదలైన 10 రకాల జంతువులను 100 డిగ్రీల వేడికి గురిచేయగా గుర్రాలకు అతి సులువుగానూ, చాలా హెచ్చుగానూ చెమట పడుతుందనీ, కుందేళ్లకు అసలు చెమటే పట్టదనీ తెలిందట.

*　　　*　　　*

అలిసిపోయినవాళ్లు కళ్లు నలుపుకోవటం మనం తరుచు గమనిస్తాం. దానికి కారణం ఉన్నది. మనిషి అలిసిపోయినప్పుడు శరీర ప్రవృత్తులు నీరసించుతాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలూ, గుండె కొట్టుకోవటమూ మొదలైనవాటి వేగం తగ్గుతుంది. అలాగే కళ్ల తాలూకు అశ్రునాళాలుకూడా చెమ్మను తక్కువగా స్రవిస్తాయి. ఈ స్రావం కనుగుడ్డును తేమగా ఉంచుతుంది. ఆ తేమ తగ్గగానే కన్నుకు కొద్ది బాధ కలుగుతుంది. కళ్లు నలుచుకోవటం వల్ల చెమ్మ హెచ్చి కళ్లకు సుఖంగా ఉంటుంది.

*　　　*　　　*

ప్రపంచంలోకెల్లా ఎత్తున ఉన్న నగరం గర్టోక్. ఇది టిబెట్‌లో ఉన్నది. ఇది సముద్ర మట్టానికి 15,100 అడుగుల ఎత్తున ఉన్నది. యునైటెడ్ స్టేట్స్‌లో ఏ పర్వతంకూడా ఈ ఎత్తు లేదు!

*　　　*　　　*

ఈనాడు ప్రపంచమంతటా ఆడుతున్న చదరంగం అనేక శతాబ్దాల క్రితం ఇండియాలో సృష్టి అయింది. చదరంగంలో వాడబడే "షా" అనే మాటకు పర్షియన్ భాషలో "రాజు" అని అర్థం. చాలాకాలంగా రష్యనులు ఈ ఆటలో ఉత్తమస్థానాన్ని సంపాదించుకుని ఉన్నారు.

# కష్టపడేవాళ్లూ, అనుభవించేవాళ్లూ

చలికాలమంతా వెచ్చగా ఉండగలందులకు ఒక ఇల్లు కట్టుకుందామనే ఉద్దేశంతో ఎద్దు బయలుదేరింది. పొటేలు ఎదురుపడి, "ఎక్కడికి, పెదనాయనా?" అని అడిగింది.

"చలికాలం రాబోతున్నది. ఇల్లు కట్టుకుందామని పోతున్నానురా, బాబూ!" అన్నది ఎద్దు.

"పద, నేనూ వస్తా!" అన్నది పొటేలు. ఆ రెండూ కొంతదూరం పోయాక ఒక పంది కలిసింది, మరికొంచెం దూరం వెళ్లాక ఒక కోడి కలిసింది. అన్నీ కలిసి వెళ్లాయి.

"ఇక్కడ ఇల్లు కట్టటానికి చాలా అనువుగా ఉన్నది. కడదాం పట్టండి!" అన్నది ఎద్దు.

"నాకు ఇంటితో ఏం పని? నావంటిన వెచ్చగా బొచ్చున్నదిగా!" అన్నది పొటేలు.

"అంతగా చలి అనిపిస్తే, నేను భూమిలో సొరంగం చేసుకోగలనులే!" అన్నది పంది.

"రెక్కలు ముఖానికి అడ్డంపెట్టుకుని నిద్రపోయానంటే నాకు చలే వెయ్యదు," అన్నది కోడి.

అందుచేత ఎద్దు ఒంటరిగా కష్టపడి ఒక గుడిసె కట్టింది. చలికాలం వచ్చింది. పొటేలూ, పందీ, కోడీ వచ్చి తలుపు తట్టాయి. కాని ఎద్దు తలుపు తీయలేదు.

"తలుపు తీస్తావా? తలతో కుమ్మి పడదొయ్యనా?" అన్నది పొటేలు.

"నా ముట్టెతో తవ్వి నీ గోడలు పడదొయ్యగలను, ఏమనుకున్నావ్!" అన్నది పంది.

"నీ ఇంటిమీద కప్పిన గడ్డి యావత్తూ పీకిపెడతాను, తెలిసిందా?" అన్నది కోడి.

విధిలేక ఎద్దు వాటినికూడా లోపలికి రానిచ్చింది. ఎద్దు కష్టపడి కట్టిన ఇంటో అవి శీతాకాలం వెళ్లబుచ్చాయి.



# 2. నేషనల్ కెమికల్ లెబొరెటరీ - పూనా

మన దేశంలో రసాయనికపరిశ్రమ ఆరంభదశలో ఉన్నది. రసాయనికపరిశోధనకూడా చాలా మందంగా ఉన్నది. ఈ లోటు తీర్చటానికి గాను ఒక సంస్థ స్థాపించాలన్న నిర్ణయం 1941 సెప్టెంబరులో జరిగింది. 1948 ఫిబ్రవరిలో నిర్మాణం ప్రారంభించిన ఈ భవనానికి 1950 జనవరి 3 న ప్రధాన మంత్రి నెహ్రూ ప్రారంభోత్సవం చేశారు. మన జాతీయ పరిశోధనాలయాలన్నిటికన్నా ముందు ప్రారంభమయినది ఇదే.

పూనాకు అయిదుమైళ్ల దూరాన గల పీఠభూమిలో నిర్మించిన ఈ భవనం నిడివి 640 అడుగులు, వెడల్పు 205 అడుగులు. ఇది అయిదు అంతస్తుల భవనం. ఇందులో లైబ్రరీ, ఆడిటోరియం, మ్యూజియం, కార్ఖానాలూ, భోజనశాలా, గిడ్డంగి, ఆఫీసులూ ఉన్నాయి.

దేశంలోని సహజసంపదను పెంపొందించటం ఈ సంస్థయొక్క ప్రధానాశయం. దేశంలోని ముడిపదార్థాలూ, పరిశ్రమలలో వాటి వినిమయమూ; కీలకపరిశ్రమలస్థాపనా, ఉన్న పరిశ్రమల తాలూకు ఉపఫలాలను వినియోగించటమూ; మూలరసాయనిక పరిశోధనలు జరిపి ఆ జ్ఞానాన్ని పరిశ్రమలకు వినియోగించటమూ; పరిశ్రమలకు తోడ్పడటమూ, రసాయనిక సాంకేతికరంగానికి చెందిన ప్రత్యేక శాఖలలో శిక్షణ ఇవ్వటమూ ఈ సంస్థ నిర్వహించే విధులు.



# వినోదాలు

ఒక ప్రసిద్ధ చిత్రకారుడికి చిత్రలేఖనం నేర్చుకునే విద్యార్థి తాను చిత్రించిన బొమ్మ ఒకటి చూపాడు.

"అబ్బాయీ, ఈ చిత్రంలో ఉన్నది ఏజాతికి చెందిన చేప?" అని చిత్రకారుడు అడిగాడు.

"అది సొరచేపండీ!" అన్నాడు విద్యార్థి.

"సొరచేప ఎలా ఉంటుందో నీకు తెలుసా ఏమిటి?" అన్నాడు చిత్రకారుడు.

"తెలియదనుకోండి. అయినా దానికేముంది? దేవతలను చిత్రించే చిత్రకారులు దేవతల నందర్నీ చూసివచ్చారంటారా?" అన్నాడు విద్యార్థి.

* * *

ఒక పెద్దమనిషి ఒక చిన్న కుర్రాడి చేతికున్న గడియారం చూసి, "ఏమోయ్, నీ గడియారం గంటెంతో చెబుతుందా ఏమిటి?" అని అడిగాడు.

"అది చెప్పదండీ! టైమెంతో తెలుసుకోవాలంటే మనం దానికేసి చూడాలి!" అన్నాడు కుర్రాడు.

* * *

"ఏమండీ, ఇప్పుడు మీ అమ్మాయి వీణ వాయిస్తూ పాడటంలేదేం?"

"మరేం లేదండీ. అది ఈమధ్య పాడకుండా వీణ వాయిస్తూంటే పొరుగింటావిడ విని, "మీ వీణ మార్చి మంచిది కొన్నట్టున్నారే?" అన్నది.

* * *

రోగి: డాక్టరుగారూ, నా జబ్బును గురించి మీరు పొరపడ్డారనీ, అందుకే మీ మందు పనిచెయ్యటంలేదనీ మావాళ్లంతా అంటున్నారు.

డాక్టరు: (గర్వంగా) రోగంగురించి నేనెన్నడూ పొరపడను. శవపరీక్ష జరిగినప్పుడు మీవాళ్లకు నిజం తెలియకపోదులెండి!

* * *

జార్జి బెర్నార్డ్ షా తన కొత్త నాటకానికి రమ్మని చర్చిల్‌ను ఆహ్వానిస్తూ రెండు టికెట్లు పంపి, "వీటిలో ఒకటి మీకు. రెండవది మీకు స్నేహితుడంటూ ఉంటే అతనికి!" అని రాశాడు.

చర్చిల్ ఇలా జవాబిచ్చాడు: "మొదటి ప్రదర్శనానికి రాలేను. రెండవ ప్రదర్శన మంటూ ఉంటే దానికి వస్తాను!"

* * *

"నేను పెద్దవాణ్ణి, చాలా కష్టాలెరుగుదును. కాని వాటిలో చాలా భాగం నాకెన్నడూ కలగలేదు"—మార్క్ ట్వేన్.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 ఆగష్టు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : "పడినావా! పరమానందం....

రెండవ ఫోటో : వదిలావా, హా! వైకుంఠం!"

పంపినవారు : వెంకటనరసింహారావు,

అసిస్టెంట్ టీచరు, M. S. పర్గి. తా॥ - హైదరాబాద్ జిల్లా॥ (దక్కన్)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకనాటి రాత్రి వీధిలో కుర్రవాళ్లు కొందరుకలిసి వేస్తున్న నాటకానికి దాసూ, వాసూలు వెళ్లారు. నాటకంలో యమధర్మరాజు వేషంవేసిన కొంటె కుర్రాడు పెద్దగా అరుస్తూ, చేతులోవున్న గదను నాటకం చూస్తున్నవాళ్లమీదికి విసిరి నానాహంగామా చేశాడు. మర్నాటి రాత్రికూడా అదేవిధంగా యమధర్మరాజు వేషంవేసిన కుర్రాడు హడావిడి చేస్తున్నంతలో, హఠాత్తుగా అతడిమీదికి ఒక వింత మృగం దూకింది. యమధర్మరాజు వేషంవేసిన కొంటె కుర్రాడు హడలుకుని, "సింహం, సింహం!" అంటూ పారిపోసాగాడు. దాసూ, వాసూలు 'టైగర్'ను పట్టుకుని, దాని వంటినవున్న నారపీచూ, చింకిగుడ్డలూ పూడతీశారు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# దీనిని చదివితే మీరు ఆశ్చర్యపడతారు...




మొక్కలు పురుగులను తింటాయని మీరు నమ్ముతారా ? ఈ చిత్రములో నున్నది దక్షిణ అమెరికా యందలి "మోహిని ఈగబోను" అనేమొక్క. ఈ చిత్రమునందు 1 వ నంబరులో, ఈగ వస్తున్నది; 2 వ నంబరులో, అది ఆకు మీద కూర్చున్నది; 3 వ నంబరులో, ఆకులు ఆ ఈగ మీద ముడుచుకొంటున్నాయి; 4 వ నంబరులో, ఈగ మ్రింగివేయబడింది.



రెక్కలులేని ఈ రెండు ఈగలను చూడండి।

రెక్కలులేని ఈగలకంటె రెక్కలున్న ఈగలు వ్యాధులను అతివేగంగా చాలా దూరం వ్యాపింపజేస్తాయి. మురికికూడా ఈగల్లాగే వ్యాధిని వ్యాపింప జేయగలదు. మీరేమి చేస్తున్నా మురికి కాకుండా తప్పించుకోలేరు. ఇంక మురికిలో మీ ఆరోగ్యానికి ఎడతెగని ప్రమాదమైనట్టి వ్యాధిని గలిగించే క్రిములున్నాయి.




లైఫ్‌బాయ్ సబ్బుతో ఈ క్రిములను కడిగివేసి మీ ఆరోగ్యమును కాపాడుకోండి. ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయండి. అది మంచి అలవాటు.

L. 282-50 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి.



# ఓ చిన్న జంతు ప్రపంచం

కలకత్తా నగరంలో ఆలీపూర్ అనేచోట ఓ సుందర మైదానంలో దేశ దేశాలనుండి తెచ్చిన రకరకాల బ్రతికివున్న వన్య మృగాలతో, పక్షులతో అందరూ చూచేలా కనుల పండువైన ఓ జంతు ప్రదర్శన శాలను ఏర్పాటు చేసారు. దీన్నే యింగ్లీషులో 'జూ' అంటారు. ఈ 'జూ' మన దేశంలో వున్నవాటన్నిటిలోకి పెద్దది, అత్యంత మనోహరమైంది.

'జూ' చుట్టూ ప్రహారిగోడ వుంది. ఆవరణలో రకరకాల పూలమొక్కలు, పొదరిళ్లు, నీటి కొలనులు వున్నాయి. కొలనుల్లో ఒయ్యారంగా విహరించే హంసలు తెల్లి కాగితపు పడవల్లా కనిపిస్తాయి. చెట్లమీద పక్షులు కిచ కిచ మంటూ, పంజరాల్లోని చిలకలు కిల కిల మంటూ ప్రేక్షకుల్ని ఆహ్వానిస్తూంటే గూళ్లలోని నెమళ్లు పురి విప్పి ఆడుతూ రంగు రంగుల పింఛాన్ని చూపిస్తాయి. కుర్రవాడొకడు చుక్కల లేడికి శెనగలు పెడుతూంటే ప్రక్కనున్న దుప్పి వసిరిక తింటూ వుంటుంది. ఇంకొంచం దూరంలో ఓ మనిషి కంగారూ మిత్రానికి గింజలు అందిస్తుంటాడు. ఓ బోనులోని పులి గాండ్రుమంటూంటే, ప్రక్క బోనులోని సింహం దర్జాగా పడుక్కుని వుంటుంది. బురదగుంటలో హిప్పో పొటమస్ దొర్లుతూ వుంటే, ఖడ్గమృగం చల్లదనానికి నీటి గుంటలో పడుకుని వుంటుంది. ఏమిచోద్యం — చారల గుర్రాలు, జిరాఫీలు, తోక లేని కోతులు, పండుజుత్తు ఎలుగుగొడ్లు, ఏనుగులు, ఒంటెలు గల యీ చిన్న ప్రపంచం! రోజూ యిక్కడకు జనం తండోప తండాలుగా వచ్చి చూచి ఆనందిస్తుంటారంటే వింతేమిటి! చూడడమే కాదు ప్రేక్షకుల్లో చాలామంది గడ్డి మైదానంలో విందులు గుడిచి, ఫలహారాలుచేసి టీ త్రాగుతారు. వీరు త్రాగేది బ్రూక్ బాండ్ టీయే; యాత్రికుల వినోద, విలాసకారుల ప్రియ పానీయం. అవును మరి, దేశంలో ప్రతిచోటలాగే కలకత్తా ప్రజలకు కూడా బ్రూక్ బాండ్ టీ అంటే మహా యిష్టం.

'జూ' లోని వింత వింత అడవి జంతువులు ప్రేక్షకులను, రంజింపచేస్తే, తోట పదును తాజా అయిన కమ్మని బ్రూక్ బాండ్ టీ వారికి అలసట తీర్చి ఉత్సాహము, ఉల్లాసము నిస్తుంది.

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

BS 295

# రవి టాయ్‌లెట్స్‌ను వాడండి

## రవి గ్లిసరిన్ సోపు:

మీ అందమును వర్చస్సును కాపాడును.

## రవి వెజిటబుల్ హేరాయిల్:

మీ కేశములను విరివిగా పెంపొందించును.

## రవి స్నో:

మీ ముఖవిలాసమును అభివృద్ధి చేయును.




సోల్ ఏజంట్లు :

**ది న్యూ స్టార్ & కంపెని,**

తండియార్పేట :: మద్రాసు-21

# ఇన్‌ఫెన్‌టోన్ గ్రైప్‌వాటర్

*లక్షణ నివారణ కోసం*




పశిబిడ్డలకు దివ్యమైన గ్రైప్ మిక్స్చర్. కడుపు నొప్పి, పళ్లు వచ్చుచున్నప్పుడు, కడుపులో వాయువువల్ల, కలిగే జబ్బులను తక్షణం నివారించును. పశిబిడ్డలను ఆనందంగాను ఆరోగ్యంగాను వుంచును. 40 ఏళ్లకు మించి బాగుగా ప్రసిద్ధయివున్నట్టిది.

నిర్మాతలు :

హైదరాబాద్ కెమికల్స్ అండ్ ఫార్మసుటికల్ వర్క్స్ లిమిటెడ్.

హైదరాబాద్—దక్కన్

PSHC-42

మే 14

మొదలు



స్వస్తిశ్రీ వారి

# రేచుక్క పగటిచుక్క

డైరెక్షన్...కె. కామేశ్వరరావు, బి.ఎ. • కెమెరా..ఎం.ఎ. రెహమాన్

నిర్మాత..... నందమూరి త్రివిక్రమరావు ....




స్టూడియో.. విజయ-వాహిని

Photo by N. V. Mithani



బహుమతి
పొందిన వ్యాఖ్య

వదిలావా, హా! వైకుంఠం!"

పంపినవారు:
వి. ఆర్. నర్సి-పర్తి

